


## ఈ రోజుల్లో తలనొప్పి అంటే మాటలా!

# సాలోఫేన్ ను వాడండి. అమోఘంగా నొప్పులను నివారించే విశిష్టమైన మాత్ర. వెల అతిచౌక

మంచి నొప్పుల నివారిణి సాలోఫేన్‌ను గమనించండి. దీనిలో రెండు మందులు అమోఘంగా నొప్పులను పోగొట్టేవి చేరివున్నాయి—ఆస్ప్రిన్, ఫెనాసిటిన్—అయినప్పటికీ వెల మాత్రము 7 పైసలే ఒక మాత్ర సాలోఫేన్ అతిశీఘ్రంగా, తలనొప్పులకు జలుబులకు పండ్లనొప్పి, ఫ్లూ జ్వరాలకు కండలనొప్పులకు ఉపశమనం కల్గిస్తుంది.

సాలోఫేన్ నొప్పుల నివారిణి మాత్రలు—ఏళ్లతరబడి ఇంటింటా ప్రసిద్ధిపొందిన అమృతాంజన్ లిమిటెడ్ వారి తయారీ-

అమృతాంజన్ లిమిటెడ్ వారి నమ్మకమైన తయారీ

**సాలోఫేన్**
అమోఘమగు నిరపాయకరమైన నొప్పుల నివారిణి

SAA/AMS/2197 TEL

# పసి డాక్టర్!

ఏమో ఎవరికి తెలుసు! ఒకానొకరోజు అతను నిజంగా డాక్టరే అవుతాడేమో! ఎందుకంటే వయస్సుతోపాటే అతని కోరికలు కూడా పెరుగుతూ, కలలలోనుంచి వాస్తవికతకు తీసుకు వెళ్తాయి. అతనికి మీరు చేయవలసిన సహాయము, అతని అభిరుచులను సక్రమమైన దారిలోనికి మళ్ళించిపెడ్తే, అతను యోగ్యమైన పనిని ఎన్నుకొంటాడు. అందుకని అతను ఆడుతూ పాడుతూ పెరిగే వయస్సులోనే అతని భవిష్యత్తు గురించి ఆలోచించండి. అతని చిన్నారి కలలను వాస్తవము చేసుకొందుకు, అతనికి ఒక అతి ప్రత్యేకమైన బహుమతి నివ్వండి.

పిల్లల బహుమతి పథకం. మీ బిడ్డకు తన స్వంత మొత్తం సమకూర్చుతుంది. ఈ మొత్తం మీ బిడ్డతోపాటు అతి సురక్షితముగా పెరుగుతుంది. ఈలోగా ఆ మొత్తాన్ని ఎవరూ కూడా తాకలేరు. అబ్బాయికి 21వ ఏట (అమ్మాయికి 18వ ఏట) ఒక పెద్ద మొత్తం చేతికి దొరుకుతుంది. మీ బిడ్డ తన కోరికలను తీర్చుకొందుకు ఈ వయసులోనే గదా ఆ పెద్ద మొత్తం కావలసివచ్చేది.

నేడే అతనికి పిల్లల బహుమతి పథకాన్ని కానుకగా ఇవ్వండి. అతని చిన్నారి కలలకు సుందర రూపాన్ని ఇవ్వండి.

ఇంకా అనేక రకాల విశేషములు కూడా ఉన్నవి. ఈ పథకములో చేరబోయే పిల్లలకు మేము ఒక బహుమతిని కూడా ఇస్తాము. ఇంకా ప్రతిసంవత్సరము పెద్ద నగదు బహుమతులతో మా ఒక లక్కీ డ్రా కూడా ఉంది, మీ బిడ్డ గెలుచుటకు అనేక అవకాశములు కూడా ఉన్నవి! నేడే చేరండి! పిల్లల బహుమతి పథకం వారి భావికి రాచబాట!

## మీ పొదుపుకు-మెట్లు యూనిట్లు.




Sista's UTI-878 Tel 77

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938-1972]

శుక్రవారం : 27-1-'78
పింగళనామ సం పుష్య బ. పంచమి
సంపుటము 71 : సంచిక 19

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు 41-60
ఆరు మాసాల చందా రు 20-80
విడిప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయసూచిక

ముఖచిత్రం: బొమ్మ
సుధ, మురళీమోహన్










# ఉత్తరాలు

## ప్రతులు

నా అభిమాన ఆరాధ్య నటుడు చిరిపిక్కున్న డ్రైవ నటసామ్రాట్ డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావుగారి ముఖచిత్రంతో విరాజిల్లిన 6.1.78 పత్రిక ముఖ్యంగా యువకులకున్నూ యువతులకే అత్యంతాకర్షించేలాగుంది. చక్కటి ముఖచిత్రాలు వేయడంలో పత్రికదే అగ్రతాంబూలం. కుర్రకారు అభిమాన నటుడి ముఖచిత్రాన్ని వేసిన మీకు అభినందిస్తూ కేవలం ముఖచిత్రం కొరకే నేను ఈ వారం ఐదు పత్రికలను కొన్న ఉదంతాన్ని తెలియజేస్తున్నాను.

అలీపోద్దీన్ అహమద్, [సుల్తానాబాద్.]

## కథలు

6—1—78 సంచిక కథలు హాస్య మాధురిగా ఉన్నవి. వీరాజీగారి స్కెచ్ బాతాఖాని చదువుతుంటే పొరుగింటి పుల్లకూర సామెతని గుర్తు చేసింది.

పి. పి. హిమబిందు సీరియల్ కొత్త సీసాలో పాత సారాంబులా ఉంది. ఈ వారం క్యాలెండర్ అందించినందుకు నా ధన్యవాదములు.

ఎన్. వి. రమణమూర్తి, [జగదల్ పూర్.]

* *

30—12—77 నీ మా పత్రికలో మీరు ప్రచురించిన శ్రీ ముదాల రాఘవయ్యగారి కథ పెళ్ళికోసం చాల సంతృప్తికరంగా వుంది. కథ చిన్నదైనాగాని సంఘటన రసవత్తరంగాను—ఆసక్తికరంగాను వుంది. శ్రీ భావరాజు రమేష్ గారి మాయాజాలం —మతికట్టు వివరాలు చాల సంతోషదాయకంగా వున్నవి.

సి. లక్ష్మీమోహన్‌గుప్తా [నాగపూర్]

## సినిమా

ఈ మధ్య మన తెలుగు సినిమాలను చూస్తుంటే ఏ చిత్రాన్ని చూస్తున్నా ఏమున్నది గర్వకారణం? దొర్లింతలు, పులకింతలు ఎక్స్‌పోజింగ్ కాక? అని అనిపిస్తుంది.

పి. శ్రీదేవి, [కాకినాడ.]

## సీరియల్

నాగవాలికి చాలా ఉత్సాహవంతంగా సాగుతున్నది. మంచి సీరియల్స్ అందిస్తున్న పత్రికను అభినందించకుండా వుండలేక పోతున్నాను.

ఎన్.బి.టి. శ్రీనివాస్‌కుమార్, [ప్యాపిలి.]

* * *

నాగబంధం సీరియల్ చాలా బాగుంది. అటువంటివే మంచి ఇంటరెస్టింగ్ సీరియల్స్‌ని ప్రచురించమని కోరుచున్నాను.

మేడా గంగారత్నం [తాడేపల్లిగూడెం.]

(49వ పేజీ చూడండి)




# కాలానికి దూరంగా..

బి.వి. రమణారావు

చూస్తూండగా గత అయిదారు సంవత్సరాల్లో మా తిరుమలరావు పేరు ప్రతిష్ఠలు తారాపథం అందుకున్నాయి. "ఆరనిచిచ్చు" "పిచికలగూడు" "కోటగోడలు" మొదలయిన నవలలు ఒకదాని వెనక ఒకటి పండితులు మొదలు పామర్ల వరకూ మెచ్చుకోవడంతో సాహితీ వేత్తల్లో ముందు వరసలోకి చొచ్చుకొచ్చేసేడు. మహామహా కొమ్ములు తిరిగిన రచయిత (త్రు)లనుకున్నవాళ్ళంతా తమ కళ్ళ ముందరే చూస్తూండగా కాశ్మీరు శాలువాలూ, పట్టు కండువాలూ, పూలదండలూ వేయించుకుంటూ సాహిత్య గర్భంలో నిలువునా వేళ్ళు తన్నేసి నిలబడి అట్టహాసం చేస్తున్న తిరుమలరావు పేరు వింటే గుడ్లు తేలేస్తున్నారు. అతని రచనలు వరదలై పత్రికా ప్రపంచాన్ని ముంచేస్తుంటే గుడ్లప్పగించి చూస్తున్నారు.

రచయిత ఎంతవాడు అంతవాడుగానే వుంటే యిబ్బందిలేదు. మా వీధిలో నా అంత రచయిత మరోడు లేడు. అలాగే వాళ్ళ కాలనీలోకల్లా గొప్ప రచయితగా వుండిపోతే తిరుమలరావుని మాత్రం ఎవరేమంటారు! యాచకస్య యాచకోశ్శత్రుః అన్న సామెత ముఖ్యంగా రచయితలకి అన్వయిస్తుంది. కష్టపడి చమటోడ్చి రాస్తే వొచ్చిన ప్రతిఫలమల్లా కాస్తంత పేరు. దాంట్లో కూడా యింత కాంపిటీషనంటే కళ్ళూ వొళ్ళూ మండవు!

అయిదారేళ్ళ క్రితం వరకూ తిరుమలరావు రచనలు మామూలు సంసారిక సాధక బాధకాల సరిహద్దుల్లో సాధారణ స్థాయిలో వుండేవి. ఒక సందేశాన్నికాని ఒక సాంఘిక సమస్యకి పరిష్కారాన్నికాని అతని రచనల్లో ఎన్నడూ ఎవడూ చూడలేదు. నేనూ తిరుమలరావూ పత్రికల్లోపడ్డ మా రచనల గురించి పరస్పరం అభినందించుకునేవాళ్ళం. అలాంటివాడు ఉన్నట్టుండి ధర్మ సంస్థాపనార్థం సంభవించిన యుగపురుషుడులాగ సాంఘిక సమస్యల్ని ఆధ్యాత్మిక మసాలాతో మేళవించి ప్రబోధాత్మకమైన నవలలు రాయడం, అది చదివి ప్రజలు ఓ హో అంటే ఓ హో అని మెచ్చుగోవడం,

## పెద్దకథ

చూస్తుంటే నాబోటిగాడికి కథలు రాయడమంటేనే చేతులాడటం లేదు

* * *

అంతా పది రోజుల క్రితం అనుకుంటాను, అరుణా విశ్వనాథ్ రాసిన 'మా పాప' నవలకి సాహిత్య ఎకాడమీ ఎవార్డు వొచ్చిన సందర్భంలో ఆ దంపతులు వాళ్ళింట్లో ఓ పార్టీ ఏర్పాటు చేశారు. భోజనాలయ్యాక అక్కడో సాహిత్య గోష్ఠి తయారైంది. అందరూ ఇతోధికంగా 'మా పాప'ని పొగిడేరు. నిజానికి అందులో ప్రత్యేకత ఏమీ లేదు. శుద్ధ దేశవాళీ సరుకు. కథ అష్టవంకర్లుగానూ తిరిగి చివర ఘట్టంలో ప్రేమికులు వాళ్ళ మూడేళ్ళ కుర్రాణ్ణి పీటమధ్య కూర్చోపెట్టుకుని వర్ణాంతర వివాహం చేసుకుంటారు. అయితే అందులోని కొన్ని సన్నివేశాలు యీమె రాసినవేనా అనిపించేటంత బాగున్నాయి.

అరుణ భర్త విశ్వనాథ్ చాలా సరదా అయినవాడు. లక్షలు లక్షలు రెండు చేతులా సంపాదిస్తున్న ఫిల్మ్ డిస్ట్రిబ్యూటరు. వాళ్ళ పెళ్ళయ్యి నాలుగేళ్ళయింది. అప్పట్నుంచీ ఏదో పేరు చెప్పి

పదిమంది రచయితల్ని పోగేసి తరచు పార్టీ లివ్వడం ఆతనికి సరదా. సభలన్నా సన్మానా లన్నా సోవనీర్లన్నా ధారళంగా విరాళాలూ, విద్యర్ ప్రైజు మెంట్సూ యిస్తూంటాడు పైగా చదువూ సంస్కారం, పదిమందిలో గౌరవం, పలుకుబడి గలవాడు. ఎకాడమీ సకాలంలో సేల్కొని అరుణ పుస్తకాన్ని గౌరవించింది లేకపోయినా దానికి పదిరెట్లు అట్టహాసంతో అరడజను మినిష్టర్లని పిలిచి బ్రహ్మాండమైన సన్మాన సభ ఏర్పాటు చేయించుకోగల సమర్థుడు

"అరుణని యిప్పుడప్పుడే మరో నవల ప్రారంభించొద్దంటున్నాను" అన్నాడు విశ్వనాథ్

"అన్యాయం, ఘోరం, మహాపాపం! భార్య భావ స్వాతంత్ర్యాన్ని అరికట్టడానికి మీకేమి హక్కుంది! తెలుగు రచయిత్రుల భర్తల సంఘం స్థాపించి మీ దౌర్జన్యాన్ని ప్రతిఘటిస్తూ ఉద్యమం లేవదీస్తాను." అంటూ బెదిరించేడు ముళ్ళపూడి సత్యం (ఉరఫ్ ముత్యం).

"చేస్తే చెయ్యండి కాని ఒకటి మాత్రం ఖాయం అరుణ నవలంటూ రాస్తే యింత కంటే మంచిది రాయాలి. అంతేకాని పేరొచ్చింది కదా యింక ఏమిరాసినా చలామణి అవుతుందన్న గర్వంతో చెత్త రాస్తే ఒప్పుకోను" అన్నాడు విశ్వనాథ్.

"అలా ఎందుకనుకుంటారు! రాసిన కొద్దీ చెయ్యి నలుగుతుంది. ప్రపంచానుభవం, విమర్శనాశక్తి, రచనాభిలాష ఆనాటి కానాడు పెరుగుతాయి కనక ముందు రాసిన వాటికంటే తర్వాత రాసినవి బాగుండి తీరతాయి" అన్నాడు పత్రికా విలేఖరి విహారి.

"కాని పరిణామం దానికి వ్యతిరేకంగా కనబడుతుంది పెద్ద పెద్ద రచయితల సంగతే చూద్దాం. మొదట్లో రెండో మూడో రఫే రఫ్‌మని రాసి పేరు సంపాదిస్తారు. ఇక జీవితాంతం ఆ పేరు నిలబెట్టుకోడానికి ఆరాటం పోరాటం. ఈ మధ్య వాళ్ళు రాసినవి మొదట్లో వాళ్ళు రాసినవాటితో పోల్చి చూస్తే వాళ్ళే పిల్లాలనిపిస్తుంది" అంది అరుణ.

"అలా అని రాయడం మానేయమంటారా! ప్రేమ, పెళ్ళి, తాళూకు సమస్యలు తప్ప మనకి కథావస్తువు లేనప్పుడు రకరకాల 'పెర్ముటేషన్ ఎండ్ కాంబినేషన్' ఉపయోగించి, రాసుకుంటూ పోవడమే. రాసేవాళ్ళ అభిరుచికీ చదివేవాళ్ళ అభిరుచికీ మధ్య మంచి సమన్వయం కుదిరింది కనకనే సాహిత్యం మహా వ్యాప్తమై ఇంత మందికి ఆశ్రయమిస్తుంది" అన్నాడు కొత్తగా పత్రిక ప్రారంభించిన శతభిషం

"నిజంగా మనం తిరుమలరావుని గురించి గర్వపడాలి. అయిదారేళ్ళ క్రితం అతని రచనలకీ యిప్పటి రచనలకీ పోలికుందా!" అన్నాడు న్యూస్ రీడర్ ప్రకాశం.

"అతనదృష్టవంతుడు అయిదేళ్ళ క్రితం భార్య పోయింది. వెంటనే వాళ్ళ కాలేజీలోనే అసిస్టెంట్ లెక్చరర్‌గా పని చేస్తున్న చక్కని చుక్కలాంటి అమ్మాయిని పెళ్ళాడేడు" అన్నాడు విహారి.

"అంతేరా బ్రదర్, భగవంతుడు రచయితల కనీస అవసరాల్ని గుర్తించనంత కాలం సాహిత్యం గతింతే. ఏదో విధంగా దుఃఖం దిగమింగడానికి అందమైన అమ్మాయిలమీద కథలల్లి కాలక్షేపం చేస్తుంటే రచనల సాంకేతిక స్థాయి దిగజారక ఎగబాకుతుందా! అంటూ వాపోయాడు శతభిషం.

"వాడి ప్రతాపం మాత్రం ఇంకెన్నాళ్ళు!

## యాపిల్ హల్వా

కావలసిన వస్తువులు :— యాపిల్ పండ్లు 2, పంచదార చిన్న కప్పు, నెయ్యి కగు మాత్రం, యాలకులు 4, జీడిపప్పులు4

తయారుచేయు విధానము :— యాపిలు పండ్లు తొక్కుతీసి చిన్న చిన్న ముక్కలుగా కోసి వుంచుకోవాలి. వాటిని మూకుడులో వేసి ముక్కలకు సరిపడా నీరుపోసి స్టవ్ మీద పెట్టాలి నీరు యిగిరిపోయాక గరిటతో ఆ ముక్కలను కలిపేస్తే ముద్దగా అయిపోతుంది అప్పుడు పంచదార పోసి కలపాలి. తర్వాత యాలకు పలుకులు పొడి కొట్టి అది వేసి, జీడిపలుకులు కూడా కలిపి నెయ్యివేసి బాగా కలిపెయ్యాలి. 4 నిమిషాలుంచి ఆర్పివెయ్యాలి. కావాలంటే రంగు వేసుకోవచ్చు ఇది త్వరగా అయిపోయి కంటికి యింపుగా తినటానికి పుల్లగా తీయగా వుంటుంది.

— చిత్రపు లక్ష్మి

కొత్త పెళ్ళాం ఎప్పటికీ కొత్త పెళ్ళాంగానే వుండదు." అన్నాడు ఆవేశంతో ఆశావాది ముత్యం.

"ఛీ! ఛీ! వూరుకోండి!" అంటూ చేతిలోవున్న 'మాపాప' ప్రతి ముత్యం మీదికి అరుణ గిరవాటెట్టడంతో ఆ టాపిక్ అంతటితో ఆగింది.

'అందరూ వెళ్ళిపోయాక నన్ను యింట్లో దిగబెట్టడానికి కార్లో తీసుకెడుతూ "ఉన్నట్టుండి తిరుమలరావు గారు ఇలా ఎలా రాయగలుగుతున్నారంటారు?" అన్నాడు. విశ్వనాథ్

"అలా నేనెందుకు రాయలేక పోతున్నానో తెలిస్తే అతనెలా రాయగలుగుతున్నాడో గ్రహించ గలిగే వాణ్ణి" అన్నాను

"అవి ఆయన సొంతంగా రాసినవి కావనీ అలాంటివి తనెక్కడో చదివిన జ్ఞాపకముందనీ అరుణ కూడా అంది" అన్నాడు అతని ప్రతీ అక్షరంలోనూ అసూయ తొణికిసలాడుతుండగా.

"షేక్‌స్పియర్ డ్రామాలన్నీ రాసింది మరొకడనే వాదన కూడా వుంది అటువంటి సందేహం కలగకుండా వుండలే కాని కలిగితే ఎన్నైనా ఆధారాలు ఊహాకి అందుబాటులో వుంటాయి" అన్నాను, మళ్ళీ ఆ మాటెత్తకుండా. అతనీ పెళ్ళామో గొప్ప రచయిత్రి అని అతని నమ్మకం. నిజానికామె విశ్వనాథ్ భార్యే కాకపోతే ఎకాడమీ ఎవార్డు వొచ్చుండదన్నది నిర్వివాదాంశం.

* * *

ఆ నాటి విమర్శలు యింకా నా చెవుల్లో గింగురుమంటూనే వున్నాయి ఇంతట్లోకే హటాత్తుగా గుండెపోటుతో తిరుమలరావు చచ్చిపోయాడన్న దుర్వార్త దిగ్భ్రమ కలిగించింది. నేను హైదరాబాద్ వెళ్ళేటప్పటికి అంత్యక్రియలు అయిపోయాయి. సంతాప సభకి మాత్రం టైముకి అందుకున్నాను. ఆ నాటి పత్రికలన్నీ కంటతడి పెట్టేయి. రేడియో కూడా గొల్లుమంది.

వాళ్ళింటి కెళ్ళి తిరుమలరావు రెండో భార్యని పరామర్శిద్దామనుకున్నాను కాని మళ్ళీ మనస్కరించక వూరుకున్నాను. తిరుమలరావు మొదటి భార్య బ్రతికున్న రోజుల్లో తరచు వాళింట్లోనే దిగుతూండే వాణ్ణి వాళ్ళది నిజంగా చిన్న కుటుంబం

## "శ్రీరామ రక్ష"

చంటి బిడ్డలకు తలంటి నీళ్ళు పోసేటప్పుడు, ఒళ్ళంతా సున్నిపిండితో తోమి శుభ్రంగా నీళ్ళుపోసి, చివర తొందరగా తల మీద నుంచి రెండు చెంబుల నీళ్ళు దిమ్మరిస్తారు. తర్వాత కొద్ది నీళ్ళు తల చుట్టూ చుట్టి "శ్రీరామ రక్ష" అంటారు.

పసిబిడ్డలకు తలపై నీళ్ళు దిమ్మరించేటప్పుడు ఉక్కిరి బిక్కిరి కావడం సహజం అది ప్రాణాపాయానికి దారి తీస్తుంది. అందువల్లనే "ఓ శ్రీరామా! ఈ బిడ్డను రక్షించు" అంటూ "శ్రీరామ! రక్ష" అని సంస్కృతంలో చెప్పడం జరిగేది. అదే క్రమంగా "శ్రీరామ రక్ష" అనే రక్షగా నిలిచిపోయింది.

పసిపిల్లలకే కాదు– పిల్లవాళ్లకు ఎంత వయస్సు వచ్చినా తల్లి తలంటిపోసేటప్పుడు చివర 'శ్రీరామ రక్ష' పెట్టడం యిప్పటికీ

## ధర్మపథం

కూడా కొన్నిచోట్ల కానవస్తుంది.

అయితే శ్రీరాముణ్ణే ఎందుకు ఇలా ప్రార్థించాలి? మరొక దేవతను ప్రార్థించ కూడదా? అనే సందేహం కలగవచ్చును.

మనవారిలో శైవ, వైష్ణవ మతాలు ఉన్నవి గదా! శైవులు శివునీ, వైష్ణవులు విష్ణుదేవుని ఆరాధిస్తారు. ఒకమతం వారికి వేరొక మతంవారి దేవుడు నచ్చడు రాముడు ఇద్దరికీ నచ్చుతాడు. 'రామ' అనే రెండక్షరాల మంత్రంలోనూ 'రా' విష్ణు మంత్ర బీజం, 'మ' శివమంత్ర బీజం. త్యాగయ్యగారు 'ఎవరనీ నిర్ణయించే దిరా?' అనే కీర్తనలో 'శివ మంత్రమునకు 'మ' బీజము, కేశవ మంత్రమునకు 'రా' బీజము అని చెప్పి ఉన్నారని అందరికీ తెలిసినదే! అందువల్ల శివ కేశవ తత్త్వాలు రెండూ శ్రీరామ తత్త్వంలో ఇమిడి ఉన్నాయని తెలుసుకోవాలి.

ప్రయాణ సమయంలో "అగ్రతః వృష తశ్చైవ" అని పూర్వం శ్లోకం చదివేవారు. ప్రయాణం చేసేటప్పుడు చోరుల వల్ల క్రూరమృగాల వల అపాయం కలగకుండా రామలక్ష్మణులే రక్షించగలరని వారినే స్మరించేవారు

ఇక నిద్రపోయేటప్పుడు దుస్వప్నాల వల్ల బెదరుపాటు కలగకుండా చెయ్యాలని దేవతలను ప్రార్థిస్తూ "రామం స్కందం హనూమంతం' అని మొదట శ్రీరాముణ్ణే స్మరిస్తారు. అతనిని నమ్ముకుంటే అడవిలోకి పోయినా ఎట్టి భయం ఉండదని చాల మంది విశ్వాసం!

"శ్రీరామ రక్ష" పిల్లలకే కాదు, పెద్దలకు కూడా అవసరమే!

—బులుసు వేంకటరమణయ్య

## కాలానికి దూరంగా

...చింతలు లేని కుటుంబం. రెండో భార్యని కట్టుకున్నాక నేను వాళ్ళింటికి వెళ్ళడం పడలేదు. పెళ్ళయ్యే ముందోసారి తన డిపార్టుమెంటులో అసిస్టెంటుగా ఆమెనోసారి పరిచయం చేశాడు. ఆమె యమ్మేస్సీ చేసయిందట. తెలుగు మాట్లాడటం వొచ్చును కాని చదవటం రాదుట. కొంచెం ముభావంగా వున్నా మంచి రూపం, హుందాతనం ఆమెలో కొట్టొచ్చినట్టు కనబడతాయి. ఆమెని తొలిసారిగా తను ఫెలోషిప్ మీద అమెరికా వెళ్ళినప్పుడు ఆమెనక్కడ కలుసుకున్నాడుట. అంతక్రితం రెండేళ్ళనుంచీ ఆమె అక్కడే రిసర్చ్ స్కాలర్‌గా వుందిట. మొత్తంమీది పాపం! చాలా దురదృష్టవంతురాలు ఏది ఏమయినా ఆమెని కలుసుకుని ఓదార్చవలసినంత సన్నిహితుణ్ణికాదు కనక మర్నాటి ఉదయం తిరిగి వెళ్ళిపోడానికి నిర్ణయించుకుని నడుం వాల్చేను ఇంతలోకే హోటల్ బోయ్ వొచ్చి నాకోసం ఎవరో వొచ్చేరని చెప్పేడు. పిలవమన్నాను. వచ్చినవాడు కేన్సర్ హాస్పటల్లో వార్డుబోయ్‌ట. "గుడ్ మార్నింగ్‌సార్. మీకు నిరంజన్‌గారి ఉత్తరం యిమ్మన్నారు" అంటూ ఓ కవరు చేతికిచ్చేడు. నిరంజనంటే ఎవరో గుర్తురాలేదు.

"నిరంజన్‌గారేం చేస్తున్నారు?" అని అడిగేను కవరు చింపుతూ.

"కేన్సర్ హాస్పటల్ స్పెషల్‌వార్డు 'బి'లో రూం నెంబర్ త్రీసార్. లివర్ కేన్సర్. హోప్లెస్ కేస్ సార్" అన్నాడు నా ప్రశ్నకి విపులంగా సమాధానమదే అయినట్టు.

ఉత్తరంతీసి చదివేను. "నన్ను మరిచి పోయి' వుంటారు. అయిదేళ్ళ కితం ఓ సాయంత్రం పుల్‌మూన్ హోటల్లో కలుసుకున్నాం. అప్పుడు మీరు అ.భా.తె.ర.మ. సభకి డెలిగేట్‌గా వొచ్చేరు. తిరుమలావుగారి అకాల మరణం సందర్భంలో విన్న జరిగిన సంతాప సభకి మీరొచ్చేరని ప్రాంతీయ వార్తల్లో విన్నాను. ఆ విషయంలో అత్యవసరంగా మీతో ఏకాంతంగా మాట్లాడాలి. దయయుంచి తప్పకుండా రండి– నిరంజన్."

"నేనీ హోటల్లో వున్నానని ఎలా తెలుసు?"

"ఏదో పేపరాఫీసుకు ఫోన్‌చేసి కనుక్కున్నారండి. తప్పకుండా రావాలిసార్, చాలా ట్రాజిడీగా వున్నారు. ఎప్పుడొస్తున్నారో కనుక్కురమ్మన్నారు సార్" అన్నాడు. సాయంత్రం వొస్తానని చెప్పమన్నాను.

అయిదేళ్ళ క్రితం తెలుగు రచయితల మహాసభకి తిరుమలావు ఆహ్వాన సంఘాధ్యక్షుడు. నేనూ దానికో డెలిగేట్నే. తిరుమలావు చాలా హడావిడిగా వున్నాడు ఓ సాయంత్రం ఏమీ తోచక ఏరదాకి కొత్తగా తెరచిన పుల్‌మూన్ హోటల్‌కి వెళ్ళి ఆరుబయట లౌంజ్‌లో కూచున్నాను ఆట్టేరష్ లేదు ఇంతలోకె గుడీవినింగ్ అనే అపరిచిత కంఠం వినపడటం, వెంటనే ఆ కంఠం తాలూకు మనిషి ప్రత్యక్షమై నాకో మందహాసం ప్రసాదించి నాముందు కుర్చీలో కూర్చుని 'బోయ్ ఆటేబుల్ మీదున్న బాటిలూ గ్లాసు యిక్కడపెట్టి మరోగ్లాసు సోడా తీసుకురా" అనడం క్షణంలో జరిగిపోయింది అతనూ నావైపు తిరిగి "నాపేరు నిరంజన్ మిమ్మల్ని గురించీ మీ రచనలు గురించీ తిరుమలావుగారు చెబుతూ వుంటారు ఉదయం సభలో మీరు కథానికల్ని గురించి చేసిన ప్రసంగం చాలా బావుంది." అన్నాడు.

నేను లేచ్చక్కా పోదా మనుకున్నాను ఆ సభ రభస భరించలేక యిక్కడికొచ్చేను. ఒకటే గందరగోళం మాట్లాడేవాళ్ళెక్కువ వినేవాళ్ళు తక్కువ. ఎవర్నైనా పలకరిస్తే చాలు రెండు నిముషాలు ఆమాట యీమాటా చెప్పి మూడో నిముషంలో తన కొత్త రచనా

ప్రస్తావన తీసుకొచ్చి అక్కడి కక్కడే నిలబెట్టి కొంత భాగం చదివి వినిపించడం, ఇంకా మనలో సహనం వుందని తోస్తే రాత్రి మనం ఎక్కడుంటామో చెబితే అక్కడికొచ్చి మిగిలిన రసవత్తరమైన భాగాలు వినిపిస్తా మంటూ పీక్కుతినడం! ఇదీ వరస! ఈ మూన్‌లోకొచ్చినా జలగలాగ తగిలేడు వీణ్ణి వొదుల్చుకోవడం ఎలాగా అని ఆలోచిస్తూ గ్లాసు పైకెత్తి "ఛియర్స్. మీ రెవరి కోసమో ఎదురు-చూస్తున్నట్టున్నారు." అన్నాను ఫుల్ బాటిల్ వుండటం చూసి.

"నేనీ వూరొచ్చి ఆర్నెల్లయింది. నాకున్న స్నేహితులిద్దరే. మొదటి స్నేహితుడు తిరుమలరావు, రెండో స్నేహితుడు వీడు" అంటూ బాటిల్ కేసి చూపెట్టేడు.

నేవీబ్లూ స్ట్రెచ్‌లాన్ పాంటూ, వైట్ ఓపెన్ కాలర్ టెరీకాట్ షర్టూ, చామన ఛాయతో కండలు తిరిగిన శరీరం, మెరిసే నల్లటి జుట్టూ, మొహం మీద దట్టమైన స్ఫోటక మచ్చలు. అది ఫేషనో జబ్బో తెలీదు నల్లద్దాలున్న లైబ్రెరీ ఫ్రేము కళ్లజోడు సినిమాలో విలన్ లాగున్నాడు. వయస్సు ముప్ఫయ్యయిదుంటాయి.

"మీరేం చేస్తున్నారు?" అడిగేను.

"ప్రస్తుతం రెండు వేళలా యిదే చేస్తున్నాను. నేను యమ్మే పేసయ్యేను. స్వగ్రామం గుంటూరు. మా మేనమామ యేభయ్యేళ్ల క్రితం ద్వీపాంతర వాస శిక్ష మీద అండమాన్స్ వెళ్లేడు. తర్వాత అక్కడే స్థిరపడి టింబర్ అండ్ కేన్ ఎక్స్‌పోర్ట్స్ వ్యాపారం చేసి లక్షలు గడించేడు. పోర్ట్ బ్లెయిర్‌లో కిరీటంలేని రాజుగా వెలిగి ఏడాది క్రితం పోయేడు. ఆయన ఆస్తికి వారసుల్లేకుండా పోతారేమోనని మా తల్లిదండ్రులు నన్నక్కడికి పంపి కృతార్థులయ్యేరు. నేను ఎనిమిదేళ్లుగా అక్కడే వుంటూ ఈ మధ్యనే యిక్కడికొచ్చేను" అన్నాడు నిర్లిప్తంగా.

"ఇండోమాన్స్ ఎక్స్‌పోర్ట్ కార్పొరేషన్ అన్న ఎడ్వర్టైజ్‌మెంటు పేపర్లో చూశాను" అన్నాను.

"ఓ! చూశారా! అదే మా ఫర్మ్."

"మీకు తిరుమలరావుతో ఎలా పరిచయమైంది?"

"ఆయన రాసిన 'జూలియోరోమియట్' అనే వ్యంగ్య నాటిక రేడియోలో విని అభినందిస్తూ ఆయనకి ఉత్తరం రాశాను. జవాబు రాశారు. అలా ప్రారంభమైన మా పరిచయం స్నేహంగా మారింది. అన్నాడు."

"ఎన్నాళ్ళుంటారిక్కడ?" అడిగేను

"ఇంకా ఏమీ నిర్ణయించుకోలేదు"

"మరి మీ కుటుంబం?"

"ఆ బెడదేమీ లేదు."

"ఇంకా పెళ్ళాడ లేదన్న మాట!"

బాటిల్ మళ్ళీ అందుకుని గ్లాసులో పోసుకుని రెండు అయిస్ క్యూబ్స్ వేసుకుని నా మొహంలోకి చూస్తూ వో చిరునవ్వు విసిరి "పెళ్ళయింది కాని విడిపోయాం" అన్నాడు.

చదువూ డబ్బూవున్న యువకుడు నిరంజన్. నడిమంత్రపుసిరి కారణంగా అలక్ష్యంచేసో, హింసించో నయాన్నో భయాన్నో పెళ్ళాం గొంతుకోసి వీడు విచ్చల విడిగా అచ్చోసిన ఆంబోతులాగ తిరగడం అలవాటు చేసుకునుంటాడు. ఇలాంటి దుర్మార్గుల్ని దండించడాని కేదైనా గట్టి చట్టం వుంటేనే కాని ఈ సమాజం బాగుపడదు. వాడి తాగుడూ వాడి దేవదాసు పోజూ చూస్తుంటే నిజంగా నాకు వొళ్లు మండింది. నేనింకా మొదటి పెగ్‌లో వున్నాను; వాడప్పుడే రెండో పెగ్గు మూడో పెగ్గులో కొచ్చేడు. చదువూ డబ్బూ ఆరోగ్యం దుర్వినియోగం చేసుకోవడం, బాధ్యతలేని పోరంబోకులా జీవించడం ఈనాటి యువకులకో ఫేషనయి పోయింది. ఇలా ఆలోచిస్తుంటే "మీ ఆలోచనలూ అంచనాలు తప్పు. ఆమె లక్షాధికారి కూతురు. చదువుకుంది, అందమైంది. మా గుమాస్తాతో లేచిపోయింది" అన్నాడు.

క్షణంపాటు నా ఆలోచనా శక్తి స్తంభించి పోయింది. కాస్త తేరుకుని "మీ తల్లిదండ్రులూ అన్నదమ్ములూ ..." అంటూండగా "అందరూ గతించేరు. ఒక్క చెల్లెలుంది. బియ్యస్సీ పేసయింది. మెడిసిన్ చదువుతానంటే డొనేషన్ కట్టి చేర్పించేను. పుష్కలంగా డబ్బు పంపి జాగ్రత్తగా చదువుకోమన్నాను. ఇప్పుడు మణిపాల్లో రెండోయేడు చదువుతుంది. ఒక షైవలియర్ విద్యార్థిని ప్రేమించిందట. ఈలోగా దానికి అయిదేళ్ల చదువు కోసం యిచ్చిన డబ్బూ ఖర్చు పెట్టేసి మళ్లీ డబ్బుకోసం రాసింది. వీల్లేదు పొమ్మన్నాను. ఇన్నాళ్లూ యిద్దరూ కలిసి జల్సాగా గాలిలో తేలిపోతూ డబ్బు తగలేసుంటారు. డబ్బంతా అయిపోయాక భూమ్మీద పాదాలు మోపింది. ఈలోగా ఆ కుర్రాడి తల్లితండ్రులు తమ బుద్ధిమంతుడైన కొడుకు పొరబాటున ఒక స్ట్రీట్ బిచ్ వల్లోపడి భ్రష్టుడై పోయినట్టు గ్రహించి మా చెల్లెలు మొహంమ్మీద వుమ్మేసి పొమ్మనుంటారు. ఆ కుర్రాడు కూడా యిప్పుడు కళ్లు తెరిచి ప్రేమమైకం లోంచి బయటపడి బుద్ధిగా తల్లిదండ్రులు చూపెట్టిన పిల్లనే పెళ్లాడటానికి నిర్ణయించుకున్నాడట. అదీ వాళ్ల ప్రేమ పర్యవసానం."

"మీ చెల్లెల్ని వెళ్లి కలుసుకున్నారా?"

"కలుసుకునేం చెయ్యాలి! ఒకళ్ల నొకళ్లు అభినందించుకోవాలా! నా పెళ్లాం లేచిపోయింది; దాన్ని మొగుడొదిలేశాడు. డబ్బు పంపలేదని పౌరుషమొచ్చి నాకు

---

## పతిత

'పశువా! త్రొక్కావు చాల'ని
ప్రక్కకు త్రోసింది ముళ్ళకంచె
'రక్తమైనా తుడుచుకో, స్టుపిడ్'
అంది జేబులో కర్చీఫ్.
కనబడని వక్షస్త్రాలు
ఫక్కున నవ్వాయి.
సినిమా షూటింగుల్లో
హీరోయిన్ల ప్రణయంలోవలె
చైతన్యం శూన్యం
చీకటి వెలుగులో తిరిగే ఈ యంత్రంలో.
ముళ్ళల్లో దిగబడినా
హృదయంలో అంధకారాన్ని చుంబిస్తూ
'ఇహపరాలకి వారధిని నేను'
అంది ప్రక్కనున్న
సోయగాల గులాబి.
'ఇది సమాధిదారి సుమా!'
హెచ్చరిక చేసింది
క్రింద నలిగిన మట్టి
అంబరాన్ని కబళించుకొని
తనువు మఱచింది అంతరాత్మ!

— డా. కె. వి. యస్. మూర్తి

---

ఉత్తరాలు రాయడం కూడా మానివేసింది"

"ఆమె భవిష్యత్తును గురించి ఆలోచించేరా!"

"మానాభిమానాలు మిగిలి వుంటే ఎప్పటికైనా మనిషిగా మారుతుంది లేదా యిలాంటివాళ్ళు ఆ తిరుగుడుకే అలవాటు పడితే వ్యభిచారిణులుగా మారతారు ఈమె గతీ అంతే కావచ్చు"

"వాటే ట్రాజిడీ!"

"ట్రాజెడీకాదు, కామెడీ కాదు ఈ ప్రేమనేది కేవలం లాటరీ నిజం చెప్పండి. అసలు ప్రేమించడమంటే ఏమిటి! కామించడం మోహించడం. శరీరాలకి మాటలకి పరిమితమైన ఆకర్షణ. ఎటొచ్చీ సాహిత్యంలోనూ సినిమాల్లోనూ ఈ ప్రేమని చిరునవ్వుతో ఆహ్వానించి కన్నీటితో కడిగి, సెంటిమెంట్‌తో అలంకరించి హృదయ చౌర్యం ఆత్మార్పణ అనే మేళతాళాలతో బ్రహ్మరథం పడతారు. ఈ రోజుల్లో బొడ్డూడని కుర్రకుంక కూడా 'వాళ్ళిద్దరూ ప్రేమించుకున్నారు.' అని చెబితే అంతా అర్థమైనట్టు తలూపుతాడు. "ప్రేమే దైవం దైవమే ప్రేమ" అంటూ దాని చుట్టూ గుడి కట్టి మనం ఆరాధించడం ప్రేమించుకున్నామనుకుంటున్న యువతీ యువకులు వాళ్ళ సువిశాల హృదయాన్ని ప్రదర్శిస్తూ తల్లిదండ్రుల్ని ధిక్కరిస్తుంటే మనం భేష్ అని చప్పట్లు కొట్టడం! కని పెంచి లాలించి పోషించి పెద్దచేసిన వాళ్ళను ప్రేమించలేని తమ పిల్లలు ఇతరులనెలా ప్రేమిస్తున్నారో అర్థంకాని తల్లిదండ్రులకి గుడ్డొచ్చి పిల్లను వెక్కిరించినట్టు వాళ్ళ పిల్లలొచ్చి వాళ్ళ ప్రేమను గురించీ దాని ఆదర్శాన్ని గురించీ అమరత్వాన్ని గురించీ ధర్మపన్నాలు బోధించడం — దాన్ని మనం సమర్థించడం!" అప్పటికే విరంజన్ ధోరణి ప్రతిమించింది. రెండుసార్లు మ్యానర్స్ వొచ్చి కాస్త నెమ్మదిగా మాట్లాడమని హెచ్చరించాడు. మంచి చెడ్డల విషయం ఎలా వున్నా అతని భావావేశాల్లోవున్న సిన్సియారిటీ నన్నాకర్షించింది.

"వీరు ప్రేమని మరీ జనరలైజ్ చేసి తుడిచి పారేస్తున్నారు. కులతత్వాలూ, వరకట్నాలలాంటి సాంఘిక దురాచారాల్ని అరి

# హైదరాబాద్ నోట్‌బుక్

**కళలో తుఫాను :**

ఆంధ్ర ప్రదేశ్ కోస్తాలో సంభవించిన తుఫాను ప్రభావం మంత్రులకు, మహామంత్రులకు రచనలు అంకితమిచ్చిన మహా కవులను కదపకపోయినా, కళాకారులను కదపడం ప్రశంసనీయమైన సంగతే. రాష్ట్ర లలితకళా అకాడెమీ జనవరి 1, 2 వారాల్లో కళాభవన్‌లో జరిపిన 16వ వార్షిక ప్రదర్శనం దీనికి తార్కాణమనవచ్చు. దీనిలో ప్రముఖ కళాకారుల ఇతివృత్తం తుఫాను. ఈ ప్రదర్శనాన్ని విద్యాశాఖా కార్యదర్శి శ్రీ దావలి శ్రీనివాసశాస్త్రి ప్రారంభిస్తూ, కళా ప్రదర్శనాల ద్వారా సామాన్యులకు కళాభిరుచి కల్గి, వారు ఆనందించే అవకాశం కలుగుతుందని అన్నారు. సాంస్కృతిక శాఖ ప్రత్యేకాధికారి డాక్టర్ అంబటి నరసింహం ప్రసంగిస్తూ లలితకళా కార్యకలాపాల విస్తరణకు మరింత ఆర్థిక సహాయం అవసరమన్నారు. శ్రీ పి. ఎస్. చంద్రశేఖర్ కంపోజిషన్ [ప్రలోభం] చిత్రానికి బహుమతి కాక స్వర్ణ పతకం లభించింది. పి.వి. కట్టి డావెస్టేషన్ [వినాశం], ఎం.జి. రెడ్డి స్కల్ప్చర్ 16, కొండపల్లి శేషగిరిరావు ది వల్చర్ [గద్ద], శ్రీహరి భోలేకర్ ది క్రో [కాకి], మహమ్మద్ యాసీన్ ది బర్త్ ఆఫ్ ఏ ఫ్లవర్ [పూవు పుట్టుక] అనేవాటికి చెరి వెయ్యి రూపాయలు బహుమతి లభించింది. కొండపల్లి శేషగిరిరావు తన చిత్రాన్ని "యూక్వా టెక్నిక్" అనే కొత్త పద్ధతిని కనిపెట్టి రచించారు. గద్ద ఈకలు గద్ద కూర్చున్న చెట్టు కొమ్మలు మొదలైన వాటిని కుంచెను ఒకటిరెండు సార్లు సారించడంలోనే సాధించి సహజతను సంతరించారు. కట్టి వినాశం చిత్రంలో స్వాభావికతను కూర్చారు. చంద్రశేఖర్ ప్రలోభం చిత్రంలో ప్రలోభం, ఉద్రేకం, వ్యామోహం ఉట్టిపడుతున్నాయి. శ్రీహరి భోలేకర్ కాకి చిత్రంలో మానవుడు కాకివంటివాడు అని, ఏ మాత్రం అవకాశం వున్నా విషయభోగాలకు ప్రయత్నిస్తాడని గొప్పగా నిరూపించారు. నగ్నస్త్రీ తలవెంట్రుకలు ధాన్యం కంకులుగా చిత్రించడం మొహంజొదారో కాలం నుంచి స్త్రీని సృష్టికి ఆధారంగా భావించే చిత్ర సంప్రదాయానికి అనుగుణం. ఈ ప్రదర్శనానికి 78 మంది చిత్రకారులు 205 కళాఖండాలు పంపారు. న్యాయ నిర్ణేతలుగా ప్రముఖ భారతీయ చిత్రకారుడు కె.కె. హెబ్బార్, ఢిల్లీ నేషనల్ మాడర్న్ ఆర్ట్ గ్యాలరీ డైరెక్టరు డాక్టర్ ఎల్. పి. సిహారే, కె. రాజయ్య న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారు. అవార్డుకు అర్హమైన ఎన్నో చిత్రాలలో పి. లోకనాథం మృత్యు కెరటాలు ఒకటి. ఇది తుఫాను బీభత్సానికి, సహజంగానే మృత్యువు దానికి జనన మరణాలు ప్రకృతి సహజాలని తెలిపే సర్వనాశనానికి ప్రతీక. ఆయనను అభినందిస్తున్నాను.

**చీలికల వాలికలు, దారికలు :**

కేంద్ర కాంగ్రెస్ సంస్థలో చీలికలు రావడంతో రాష్ట్రంలోను సంస్థ బీటలు వారింది. బ్రహ్మానందరెడ్డి వర్గం, ఇందిరాగాంధీ వర్గం, మరొక వర్గం, ఇంకొక వర్గం ఇలా ఎన్ని వర్గాలవుతాయో తెలియదు. ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు మాత్రం ఎందరు ప్రలోభం కలిగించినా, ప్రధాన సంస్థనే అంటిపెట్టుకొని వుంటానని హామీ ఇచ్చారు. తలకొక పార్టీ పెట్టుకోడం అనివార్యమయ్యే సూచనలు ఉండడం వల్ల పరిస్థితి గందరగోళంగా ఉందనే చెప్పాలి. జిల్లాలనుండి కాంగ్రెస్ నుంచి రాజీనామాల పరంపర వినవస్తోంది. ఏదే. రోజుకొక మంత్రి రాజీనామా ఇవ్వడం సంప్రదాయమైపోయింది. అధికారం లేకపోతే కుక్కలు చింపిన విస్తరిలా అవుతుంది కాంగ్రెస్‌ని ఎవరూ భావించలేదు. సేవ, ధర్మ నిర్వహణ, కర్తవ్య పరాయణత వంటివాటిని అధికారదాహం, ఆశ్రిత పక్షపాతం త్రోసిరాజన్నాయి. ఇలా వున్నప్పుడు ఎంత గొప్ప పార్టీ అయినా హరీ హరీ! ఈ కల్లోల పరిస్థితి జనతా పార్టీకి అనుకూలమయ్యే సూచనలు కనిపిస్తున్నాయి. కమిషన్ల పుణ్యమా అని పాత నాయకుల అన్యాయాలు జనానికి విరివిగా తెలుస్తున్నాయి. అయినా వ్యామోహపడి వారి వెంట పడేవారి సంగతి ఏమైనా, ప్రజాసామాన్యం కొత్త పార్టీల పట్ల ఆదరం చూపే అవకాశం ఉంది. ఈ ఆదరాన్ని జనతాపార్టీ ఎలా మలచుకుంటుందో జనాలకు ఇంకా వ్యవధి ఇవ్వడానికి సిద్ధమే. 30 ఏళ్ల కాంగ్రెస్‌ను, పదకొండేళ్ల ఇందిరా గాంధీని సహించి సమర్థించగా లేంది జనతాను మరి కొన్నాళ్లు సహించరా? కాని అలాగని జనతా ఒప్పు పండినదని, జనతా గట్టిగా ఈ పని చేసింది అని చెప్పదగ్గ పని చేస్తే చాలు. ఒక్కటీరం భయం లేదు జనతాకు.

**వతన్ దార్ల ఊరేగింపు :**

వతన్‌దారీ వ్యవస్థ రద్దు బిల్లును ఉపసంహరించాలని కోరుతూ పటేళ్లు, పట్వారీలు మాలీ పటేళ్లు, కొత్వాల్ పటేళ్లు సేక్‌సింధీలు, సరదేలు డిసెంబరు 28వ తేదీ ఉదయం గాంధీభవన్ నుంచి విధాన సభకు వెళ్లి స్పీకరుకు వినతి పత్రం అందజేశారు. శ్రీయుతులు రామచంద్రరావు దేశపాండే, సి.వి. ప్రతాపరెడ్డి ఊరేగింపుకు నాయకత్వం వహించారు. డిసెంబర్ 24వ తేదీ ఉదయం గాంధీ భవన్‌లో జరిగిన తెలంగాణా గ్రామాధికార్ల సభలో శ్రీ చొక్కారావు ప్రసంగించారు. దాదాపు మూడు వేల మంది ప్రతినిధులు సభలో పాల్గొన్నారు. ఏమైనా రాజులు, రాజరికాలు పోయిన తర్వాత— ఆస్తి హక్కే రద్దు చేయాలనే కాలంలో ఈ వతన్‌దార్లు కూడ పునరాలోచన జరుపవలసి వుంటుంది.

(50వ పేజీ చూడండి)

---

కట్టడానికి ఈ ప్రేమ అనే పాప్యులర్ సెంటిమెంట్‌ను ప్రోత్సహించడం అవసరం. మీరు చెప్పినట్టుగా ప్రేమ కేవలం కామానికి బురఖాయే కావచ్చు. అలాంటి స్వాతంత్ర్యం యువతీ యువకులకు అవసరం" అన్నాను.

"నాన్‌సెన్స్! సంఘసంస్కారం దృష్టిలో పెట్టుకుని యువతీ యువకులు ప్రేమించుకోరు. అది అర్థంలేని వాదన. ఏక వర్ణ వివాహాలు నిషేధించి వర్ణాంతర వివాహాలే వుండాలని శాసనం చేసినా ఈ ప్రేమ సమస్యల్ని పరిష్కరించలేరు. ఈనాడు ప్రచారంలో వున్న సాహిత్యంలో ప్రోత్సహించే యువతీ యువకుల స్వాతంత్ర్యం ముఖ్యంగా స్త్రీలను తప్పుదారి తొక్కిస్తుంది. మాటవరసకి మీ 'గాజుబొమ్మ' కథ తీసుకోండి..."

ఇంక యీ సంభాషణకి స్వస్తి చెప్పి బయట పడదామనుకుంటుంటే నా కథ ప్రసక్తి తీసుకురాగానే సహజ దౌర్బల్యంతో మళ్లీ మెత్తబడి చతికిలబడ్డాను. అందులోనూ ఈ కథ రాసి చాలా కాలమైంది. అదే నేను రాసిన మొదటి కథని జ్ఞాపకం. అతను చెప్పుకు పోతున్నాడు...

"అందులో నాయిక చదువూ సంస్కారం లేని పల్లెపడుచు. పచ్చగడ్డి అమ్ముకోడానికి పట్నం వొస్తూ పట్నవాసం గాలీ సిరు వొంటబట్టి ఇద్దరు కాలేజీ కుర్రాళ్ల వలలోపడి ఆ జీవితమే శాశ్వతమన్న భ్రమతో తన వూరూ, భర్తా, సంసారం విడిచిపెట్టి చివరికి గతిలేక పడుపు వృత్తిలోకి దిగుతుంది. ఆమె జీవిత గాథ చదువుతుంటే కళ్లల్లో నీళ్లు తిరగకుండా వుండవు. కథలో పాత్రల చిత్రీకరణ సహజంగా వుంది. స్త్రీ స్వాతంత్ర్యానికి అవసరమైన హద్దులు అడుగడుగునా అభివ్యక్తమవుతాయి. అందుకే అప్పుడూ యిప్పుడూ కూడా మిమ్మల్ని 'గాజుబొమ్మ' కథా రచయితగానే జ్ఞాపకముంచుకుంటూ వుంటాను" అన్నాడు.

"థేంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్" అన్నాను ఇంక లేవడానికి ఉద్యుక్తుణ్ణవుతూ.

( ఇంకా ఉంది )

# సమాంతర రేఖలు

కొంగతి చంద్రావళి

చిన్న పూలతోట ఉన్న యింటిముందు రిక్షా ఆపమన్నాను. ఆగగానే ఉస్సురంటూ దిగి వాడికి డబ్బులిచ్చేసి, బ్యాగ్ తీసుకుని లోపలికి నడిచాను. నా అదృష్టం బాగున్నట్టుంది. భారతి యింట్లోనే వుంది. గేటు చప్పుడికి బయటకి వచ్చింది. నన్ను చూడగానే మొహం విప్పారింది.

"ఎంత అదృష్టం! ఏమిటే హఠాత్ ఆగమనం ?" అంటూ ఎదురొచ్చింది.

బదులేమీ చెప్పకుండా నిట్టూర్చి, ఆమెనే తదేకంగా చూడసాగాను. తలంటు పోసుకున్న పెద్ద వాల్జడ, గులాబీరంగు వాయిల్ చీర, అదేరంగు జాకెట్‌తో పాతికేళ్ళ యువతిలా ఉంది. భారతిదీ, నాదీ ఒకే వయస్సు.

పీలక జడతో, కొద్దిగా లావయిన శరీరంతో, కళ్ళ కింద ఏర్పడిన నల్లటి వలయాలతో, లేని పెద్దతనం బలవంతాన రుద్దుకున్న నా రూపం గుర్తొచ్చింది.

పెద్దతనం లేకపోవడమేమిటి ? కొన్నాళ్లలో అత్తగారు కూడా కాబోతుంటే ! మళ్లీ నిట్టూర్చాను

"ఏమిటలా నిలబడ్డావు ! లోపలికి రా!" అంది భారతి నేనేమీ మాట్లాడకుండా ఆమె వెంట లోపలికి నడిచాను

పావుగంట తర్వాత భారతి, నేనూ తోటలో కుర్చీలు వేసుకుని కూర్చున్నాము. చుట్టూ అన్నీ పూలు ! స్వచ్ఛమైన భారతి మనస్సులాగే నవ్వుతున్నాయి నేను ఇంత వరకూ గమనించ లేదు కానీ, భారతి మొహంలో కొత్తకళ కనిపిస్తోంది

"ఇంతకీ ఈ వూరు తమరు పావనం చేయడానికి కారణమేమిటి ?" అడిగింది.

"పెళ్లి సంబంధం చూడాలి!" అన్నాను.

"ఎవరికి ?" ఆశ్చర్యంగ అడిగింది

"ఇంకెవరికీ రాధకే!" నెమ్మదిగా అన్నాను

"గుడ్ ! వెరీగుడ్ ! అయినా ఇంత శుభవార్త అంత నెమ్మదిగా, నీరసంగా చెబుతావేమే ?" అంది నవ్వుతూ

మిరగేసేటట్టు చూశాను దాని వైపు.

"ఎందుకలా చూస్తావు? తొందరలో అమ్మమ్మ నవులావని భయమా? లోకంలో జరిగేదే అది! ప్రకృతి ధర్మం !"

"నోరు ముయ్యి!" అన్నాను చిరాగ్గా.

భారతి నవ్వింది

"ఎందుకే అంత కోపం! ఈడొచ్చిన పిల్లకి పెళ్లి చెయ్యవా?"

"నా మొహం పెళ్లి! దాన్ని నీలాగా చదివించి, డాక్టర్‌ని చేద్దామనుకున్నాను. ఏవరిపోలిక పడిందోగానీ టెన్త్ క్లాసు రెండు సార్లు తప్పింది. నేనె నయం. కనీసం స్కూల్ ఫైనలన్నా గట్టెక్కాను" అన్నాను కసిగా

"దానికి చదువబ్బకపోతే అదేంచేస్తుంది పాపం!" అంది భారతి రాధను వెనకేసు కొస్తూ రాధకు నా కంటె భారతి దగ్గరే






డాక్టరుగారూ! నా బొమ్మ పాపకు
కులాసాగా లేదండీ.
కాస్త పరీక్ష చేయండి.





జ్వరం లేదు. కానీ,
కడుపునొప్పితో అవస్థ పడుతోంది.
పాపకు ఎప్పుడైనా
ఉపశమనంగా లేనప్పుడు
వుడ్‌వర్డ్స్ గ్రైప్‌వాటర్
ఉపశమనాన్ని చేకూర్చగలదు.
మా అమ్మకూడా నాకు
దీనినే యిచ్చేది.





IMPORTANT TO MOTHERS
WOODWARD'S CELEBRATED
"GRIPE WATER"
INFANTS' PRESERVATIVE





వుడ్‌వార్డ్స్ గ్రైప్ వాటర్
100 సంవత్సరాలకు పైగా చాతుర్యమైన
తల్లులకు విశ్వాసపాత్రమైనది.
వుడ్‌వర్డ్స్ కడుపునొప్పి, ఉబ్బరం, అజీర్ణ విరేచనాలు మరియు పాపలకు
పళ్లు వచ్చేప్పుడు సంభవించే బాధలను నివారించి ఉపశమనాన్ని చేకూర్చగలదు.
CAS OPPL-1 TE 77

చనువెక్కువ. రెండేళ్ల క్రిందట కాబోలు రాధ భారతితో ఫిర్యాదు చేసింది.

"టెన్త్ ఫెయిల్ అయ్యానని అమ్మ రోజూ నా ప్రాణం తీస్తోంది పిన్నీ! అన్నీ పాసయ్యాను. కానీ లెక్కలు దెబ్బతింటు న్నాను. నాకూ వాటికీ చుక్కెదురు. నేనేం చెయ్యను?" అని.

"నువ్వు చాలా అదృష్టవంతురాలివే లక్ష్మీ రాధలాంటి అందమైన తెలివైన కూతురు ఎవరికుంది చెప్పు!" అంది భారతి అప్పుడు.

"నా మొహం తెలివి! టెన్త్ పాస్ కాలేక పోయింది గానీ, ఎందుకూ తెలివి తేటలు గంగలో కలవనా?" అన్నాను కోపంగా.

భారతి ఏదో అడగటంతో ఈ లోకం లోకి వచ్చాను.

"ఇంతకీ బావగారు క్షేమమా?"

"ఆయనకేం లక్షణంగా ఉన్నారు. బట్టతలతో సహా" అన్నాను.

విరగబడి నవ్వింది భారతి.

"పాపం! ఆయన బట్టతల మీద పడ్డావేమిటే?" అని.

కొంచెం ఆగి తిరిగి యిలా అంది

"లక్ష్మీ! నువ్వు చాలా అదృష్టవంతు రాలివే!"

ఛర్రుమంది నాకు.

"నా మొహం అదృష్టం పద్నాలుగేళ్లకు పెళ్లి చేసుకుని' పదిహేనో ఏట తల్లినై, ఇప్పుడీ ముప్పైమూడవ ఏట అత్తగారు కావటం అదృష్టమా? నాకు నీలాగా చదువుకోవాలని ఎంత ఆశ ఉండేది! ఆ ఆశ ఆడియాసై పోయింది. పోనీ యింట్లో స్వతంత్రమా అంటే అదీ లేదు. అటు అమ్మా, నాన్నా, యిటు అత్తయ్యా, మామయ్యా నా పాలిట యమకింకరులు. ఒక్కపనీ స్వతంత్రించి చెయ్యడానికి లేదు. చివరకి చీర కట్టుకుని, నగలు పెట్టుకొనే విషయంలో కూడా అంతే! నేనో మైదానంలో బంతిని. వాళ్లంతా ఆటగాళ్ళు. బావకి తన ప్రాక్టీస్ తప్ప ఏదీ పట్టదు. చూసేవారికి నేనో శ్రీమంతుడయిన డాక్టరు భార్యను. ఒక అయినింటి 'కోడల్ని. ఓ అందాల బొమ్మకు తల్లిని నా మనస్సులో వుండే దావానలం బయటికెలా కనపడు తుంది?"



చివరి మాటలు అంటూండగా నా కళ్లలో నీళ్ళు తిరిగాయి.

"ఛీ! లక్ష్మీ, ఏమిటది? నీకేమైనా మతి పోయిందా?" భారతి కంగారుగా అంది

నేను చప్పున కళ్ళు తుడుచుకున్నాను.

"కనీసం నా కలలు నా కూతురి విషయంలో నైనా తీర్చుకుందా మను కున్నాను. దాన్ని చిన్నప్పుడే ఏదైనా కాన్వెంట్‌లో చేరుస్తానంటే పడనిచ్చారా! నా బ్రతుకులా దాని బ్రతుకూ చర్విత చరణం కాబోతూంది." అన్నాను

సీరియస్‌గా అయిపోయింది భారతి వదనం

"రాధ చదువుకోలేదనేగా నీ బాధ! నేనూ డాక్టర్నే! నా ఈ చదువు నన్నెంత సుఖపెట్ట గలిగిందో చెప్పగలవా?" గంభీరంగా అంది.

నా నోట మాట రాలేదు.

* * *

భారతిది జమిందారి ఫాయాలో నడచిన కుటుంబం. అంతులేని ఆడంబరాలకూ విలాసాలకూ లెక్కలేకుండా డబ్బు ఖర్చు పెట్టేవారు మొత్తం పదకొండు మంది సంతానం. ముగ్గురు అమ్మాయిలకు వైభవంగా పెళ్లి చేశారు. నాల్గవది భారతి. తర్వాత ఐదుగురు అబ్బాయిలూ, మధ్యలో ఇద్దరు అమ్మాయిలు. భారతి మెడిసిన్ చదువుతాననగానే గ్రీన్ సిగ్నల్ యిచ్చేసి తర్వాత అమ్మాయికి పెళ్లిచేశారు భారతి నాన్న. భారతి ఎమ్. బి. ఫైనల్లో వాళ్ళ నాన్న పోయారు. అప్పుడు కానీ తెలిసిరాలేదు వారి కుటుంబ పరిస్థితి ఎంత అధోగతిలో వుందో! పొలాలన్నీ తాకట్టులో వున్నాయి. బ్యాంక్ బ్యాలన్స్ నిల్. పైగా పెద్ద పెద్ద మొత్తాలలో అప్పులు. భారతి అధైర్యపడ లేదు. ఇంకా రెక్కలురాని తమ్ముళ్ళ భారమంతా నెత్తిన వేసుకుంది. ఒక ప్రక్క ఉద్యోగమూ, మరో ప్రక్క ప్రాక్టీసు పెట్టింది. పల్లెటూర్లో ఆ యింట్లో వుండేవారు వుండగా. తమ్ముళ్ళు తలో దిక్కున హాస్టల్లో వుండి చదువుకున్నారు. భారతి తన కుటుంబానికై రక్తం ధార పోసినా ఇంటో వారికి తెలియలేదు ఒక్క నాకూ, భారతి తల్లికి తప్ప భారతి

వాళమ్మ ఆడంబరాలూ విలాసాలూ ఏంత మాత్రం తగ్గించలేదు! చనిపోయిన భర్త కాలంలో ఎలా జరిగేదో, ఇప్పుడూ అలాగే జరుగుతోందని లోకులు అనుకోవాలని తాప త్రయ పడేది. ఎప్పుడూ కూతుర్నీ, అల్లుళ్నీ ఏదో ఒక సాకుతో యింట్లోనే తిష్ఠవేసేవారు.

"నువ్వీ అర్థం లేని త్యాగం ఎందుకు చేస్తున్నావో నా కర్థం కావడంలేదు భారతీ! నీ మానాన నువ్వు పెళ్ళి చేసుకుని వెళిపో" మీవాళ్ళు వేసే వేషాలూ, పెట్టే ఖర్చూ చూస్తూవుంటే నాకు కడుపు రగిలి పోతోంది" అని భారతితో పోట్లాడేను ఎన్నోసార్లు.

"నేను ఒకటి అడగనా లక్ష్మీ! నువ్వు మీ అమ్మా, నాన్నను, అత్తయ్యను. మామయ్యనూ ఎదిరించి మీ బావను తీసుక వచ్చి సిటీలో కాపురంలో పెట్టగలవా?" ఎదురు ప్రశ్న వేసింది

"నా వల్లకాదు" అనేదాన్ని.

"ఇదీ అంతే! నీవు వాళ్ళని వదలి ఎందుకు పోలేవో, నేనూ అలాగే వీళ్ళకి సహాయం చేయకుండా ఉండలేను నీకు వాళ్ళని ఎదిరించాలని వుంటుంది. నాకూ వీళ్ళని వదలి పోవాలని వుంటుంది. రెండూ చేయలేము" అంది.

భారతి పెళ్ళి విషయం ఎత్తితేమటుకు వాళ్ళమ్మ ఎగిరి పడేది.

"ఇది మరీ బావుంది! మా ఆస్తికీ, అంతస్తుకూ తగిన సంబంధం రావద్దూ! అది డాక్టర్నే చేసుకుంటానని పట్టు బట్టింది. డాక్టర్లు దొరికినా ఏం లాభం! ఆస్తి లేకపోయాక, అయినా అది సరదాగ కొన్నాళ్ళు వుద్యోగం చేస్తానంటోంది. ఇప్పుడే పెళ్ళి వద్దంటోంది కూడానూ" అనేది.

భారతి చెల్లెలికి పెళ్ళి అయ్యింది. ఇద్దరు తమ్ముళ్ళకు కూడా అయింది. అంతా అభివృద్ధిలోకి వచ్చారు. రెండేళ్ళ క్రిందట కాబోలు మూడో తమ్ముడు పెళ్ళి కూడా అయింది. పెళ్ళికి ముప్పై వేల కట్నం తీసుకుని అందులో పదిహేను వే. కోడలికి చీరలూ, నగలూ, పెట్టి, మిగతా పదిహేను వేలూ అట్టహాసంగా ఖర్చు పెట్టింది వాళ్ళమ్మ. 'మా యింట్లో తొలిగా కోడలు వస్తోంది. ఆ మాత్రమైనా ఖర్చు పెట్టకపోతే ఎలా?' అంది పైగా, తెలిసిన వాళ్ళందరితోనూ.

మొత్తానికి భారతి బాధ్యతలన్నీ దాదాపు పూర్తయినట్లే.

"నువ్వూరికే ఏవేవో ఊహించుకుని బాధపడకు లక్ష్మీ! ప్రతి ఒక అడదీ చదువుకుని ఉద్యోగాలు చేస్తుంటే యిది ఇండియా కాదు. అమెరికా అయ్యేది. మనం సంఘాన్నెదిరించి ఏ పనీ చెయ్యలేం! అలాగే నీ కూతురి పెళ్ళి కూడా నూ" భారతి మాట్లాడుతుంటే ఈ లోకంలోకి వచ్చాను.

"ఇంతకీ రాధ పెళ్ళి వివరాలు చెప్ప లేదేం? పెళ్ళికొడుకు ఎవరూ, ఏంచేస్తుంటారూ, వగైరా..."

భారతి ప్రశ్నలు వినిపించుకోలేదు నేను. అంతవరకూ భారతిని అడుగుదామన్న ప్రశ్న హఠాత్తుగా గుర్తొచ్చింది. గబగబా అడిగాను.

"దాని పెళ్ళి మాటకేం గానీ, నీలో ఏదో కొత్త మార్పు కనిపిస్తోంది. కారణం ఏమిటి?" భారతి నవ్వింది ఆ నవ్వులో సిగ్గు దొంతరలు గోచరించాయి.

"నీ దగ్గిర దాపరికం దేనికిలేగానీ, పెళ్ళి చేసుకోబోతున్నాను" అంది.

"ఎవర్ని?" అనుమానంగా అడిగాను. భారతి చిన్నక్క పోయింది పురిట్లో. వాళ్ళ బావని చేసుకోమని భారతిని అడుగుతున్నారని నాకు తెలుసు. కొంపదీసి అతన్ని కాదు గదా!

"అతనూ డాక్టరే! మధు అని నా కొలీగ్. నా కంటే కాస్త చిన్నవాడే. సంవత్సరం నుంచీ పరిచయం. పెళ్ళి చేసుకొని స్టేట్స్‌కు వెళ్ళాలని నిర్ణయించుకున్నాం" భారతి కంఠంలో దాచుకుందామన్నా ఆనందం దాగటం లేదు. ఉత్సాహంగా అతని వివరాలు చెప్పసాగింది.

చుట్టూ చీకట్లు ముసురుకుంటున్నాయి ఒకరి మొహాల్లోని భావాలు మరొకరికి కనుపించవు అయినా నా మనస్సులోని ఉద్వేగాన్ని మొహంలోకి ప్రసరించకుండా అదిమి పట్టాను.

* * *

రాధ పెళ్ళి సంబంధం గురించిన వివరాలు భారతికి చెప్పకుండానే మరునాడు వచ్చేశాను. ఏమని చెప్పగలను? ఇన్నాళ్ళూ ఆగి, యిప్పటికి పెళ్ళికూతురు కాబోతున్న నా ప్రియ నెచ్చెలి కాబోయే భర్తనే, నేను రాధకి చూడటానికి వచ్చానని ఎలాచెప్పను? రాధకి ఈ సంబంధం కాకపోతే మరొకటి దొరకక పోదు. అంతేకాని ఎంతో సంతోషంగా వున్న భారతి ఉత్సాహం ఎలా పాడు చెయ్యను?

"పెళ్ళికొడుకుని చూశావా?" యింటిలోని వారందరి ప్రశ్నకూ జవాబుగా ఏదో కుంటిసాకు చెప్పాను.

ఈ సంబంధం నాకిష్టంలేదనీ, ఎలాగోలా మావాళ్ల ప్రయత్నాలు ఆపాలని ఎంతో ప్రయత్నించాను. కాని కారణం యిదీ అని ప్రత్యేకంగా చెప్పలేక పోయాను. మా వాళ్ళలో ఏ ఒక్కరైనా భారతిని గురించి అగౌరవంగా మాట్లాడితే భరించే



శక్తి నాకు లేదు. అది విప్లవమూ మావాళ్ళ దృష్టిలో ఉన్నతంగా కనపడాలనే నా తాపత్రయం.

రాధకి ఈ సంబంధం కుదరకుండా చేసి, భారతికి అడ్డం లేకుండా చేద్దామని నే ప్రయత్నిస్తే అది బావ దృష్టికి కోపాన్ని తెప్పించింది.

“నీ స్వంత కూతురి మీద నీ కింత కసి ఎలా పుట్టుకొచ్చింది ? నువ్వు ఈ ఊరు దాటకుండా గడిపావని, దాన్నీ అలాగే చేద్దామని చూస్తున్నావా ? అది ఎక్కడ ఫారెన్ వెళ్లిపోతుందో అనే కదా నీ ఈర్ష్య అంతా !” అన్నాడు.

నా కళ్లలో నీళ్లు తిరిగాయి. నా ఆవేదన ఎవరు అర్థం చేసుకుంటారు ? రాధని, నా కన్న బిడ్డని చూసి నేను అసూయ పడుతున్నానా !

నాకు అంధకారంలో ఆశాకిరణం ఒకటే కనిపిస్తోంది. అది మధు సమ్మతి. అతను ఒప్పుకుంటేనే కదా ఈ పెళ్లి జరిగేది ! భారతిని ఎంతో అభిమానించే అతని మనస్సులో ఏ విష పురుగూ తొలచకుండా చేయి భగవంతుడా ! అని రోజూ ప్రార్థించ సాగేను. డబ్బు ఎంత పనయినా చేయగలదు మరి.

పొరపాటు ఎక్కడ జరిగిందో ఎలా జరిగిందో కానీ నా కల ఫలించలేదు. మధు మా యింటికి రావడం, రాధను చూడడం జరిగిపోయేయి. అతను పెళ్ళికి ఒప్పుకోవడమే కాదు, తాంబూలాలు పుచ్చుకోవడం జరిగిపోయింది. పెళ్లి ముహూర్తం కూడా నిర్ణయించేశారు. నేను నిర్వికారంగా చూడడం మినహా ఏమీ చేయలేక పోయాను. నా నిస్సహాయతను నిందించుకోవటమే కాదు, లోకంలో ఉన్న మగవాళ్లనంతా నా మనస్సులో దుమ్మెత్తి పోశాను.

పెళ్లి పదిహేను రోజులుండగా భారతి వచ్చింది. వట్టిచేతులతో కాదు, చేతిలో శుభలేఖతో.

“రాధ పెళ్లికి నేను రాలేకపోతున్నానే లక్ష్మీ ! ఎందుకంటే ఆ వేళే నా పెళ్లి కూడా” నవ్వుతూ చెప్పింది.

అదే నవ్వు ! చెక్కుచెదరని గాంభీర్యం ! నా కళ్లలో గిర్రున నీళ్ళు తిరిగాయి.

“క్షమించు భారతీ ! నీ ఈ పెళ్లికి నా అసమర్థతే కారణం” ఏడుస్తూ



అన్నాను.

“ఛీ! ఊర్కో, ఏమిటది?” వారించింది భారతి.

“అసలు నిన్నని ఏం లాభం! ఈ మగ వాళ్లని అనాలి. నిజం చెప్పు భారతీ! రాధకి ఈ సంబంధం చూస్తున్నామని నీ కెవరు చెప్పారు? మధు నిన్ను చేసుకోకపోవడానికి కారణం ఏమిటి? చెప్పు! చెప్పకపోతే నామీద ఒట్టే !”

భారతి విషాదంగా నవ్వింది. అది చెప్పింది విని నేను నీరు కారిపోయాను. నేను వచ్చేసిన తర్వాత బావ ఓసారి భారతిని కలవడం జరిగిందిట. మాటల సందర్భంలో రాధ పెళ్లి సంబంధం విషయమూ నా అయిష్టత చెప్పాడు భారతికి అపుడర్థ మయింది నేను రాధ పెళ్లి వివరాలు చెప్ప కుండా ఎందుకు వచ్చేశానో! ఆ తర్వాత మధుతో చెప్పింది. తాను అతన్ని పెళ్లి చేసుకోబోవటం లేదని. అతను తెల్లబోయేడుట. తర్వాత కారణం చెప్పమని అర్థించేడుట. భారతి ఏమీ చెప్పడానికి నిరాకరించింది అంతే! అతను భారతి మీద కోపంతో వెంటనే మా యింటికి రావడం రాధను చూడడం జరిగిపోయేయి

“ఎందుకిలా చేసేవ్ భారతీ! రాధకి ఈ సంబంధం కాకపోతే మరొకటి కుదరక పోయేదా? దీనికి నీ భవిష్యత్తు ఎందుకు బలికావాలి? ఇంత త్యాగం దేనికి?” ఆవేశంగా అడిగాను

“ఇందులో త్యాగం ఏముంది? నేను బాగా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను ఇప్పుడేదో క్షణికావేశంలో అతను నన్ను చేసుకుంటానన్నా, ముందు ముందు బాధ పడవచ్చు అటు అతనివైపు వారికీ ఇటు మా వాళ్ళకీ/యిష్టం వుండదు. ఈ పెళ్లి జరిగి ఏం లాభం? ఈ బంధాలన్నీ తెంచుకుని వేరే దేశం వెళ్లి మేము మటుకు ఎలా సుఖంగా వుండగలం? అందుకే బావని చేసుకుని, అక్క పిల్లల్ని బాగా చూడాలని నిశ్చయించుకున్నాను. అలా చేస్తే ఈ సంఘం నన్ను మెచ్చుకుంటుంది కూడానూ పోతే రాధకు ఇంతకంటె మంచి సంబంధం చూడగలమూ అన్నావు. అది నీ వల్ల కాదే! నువ్వు ఒకవేళ చూసినా అవతల వ్యక్తి రాధ డబ్బును చూసి చేసుకుంటాడు గానీ రాధ మనసు చూడడు. కారణం? దానికి చదువు లేదు ఇప్పుడు ఈ మధు అయినా సరే నా పరిచయం లేకుండా ఉన్నాడనుకో నీవు వెళ్ళి ప్రయత్నిస్తే అతను అంగీకరించడు. ఇప్పుడతను ఓ విధమైన కసిలో వున్నాడు ఈ చదువుకున్న ఆడవారి కంటే, సంసార పక్షం ఆడపిల్లలు నయం అనే భావం అతని మనస్సులో ముద్ర వేసింది ఈ తిక్కలోనే రాధ అందం అతన్ని కట్టి పడేసింది. అయినా రాధ నీ కూతురైనా, నా కూతురు మాత్రం కాదేమిటే ? దాని పెళ్లి సంబంధం చూడటంలో నాకు మాత్రం బాధ్యత లేదూ ? నా జీవితం సగం అయిపోయింది. ముందు ముందు భవిష్యత్తు ఉన్నది అది దానికోసం ఈ మాత్రం చేసిన దానికి అంత బాధ పడతావెందుకూ ?” ముగించింది భారతి.

నా కను కొలకుల్లో నీళ్ళు నిలిచాయి. భారతి ఎప్పటికీ అంతే! నిండు కుండ. తొణకదు దాని త్యాగం బయటకి తెలియ నివ్వదు తన కుటుంబానికింత సహాయం చేసినా బయటకు తెలియనీయ లేదు. ఒక్క నాకు తప్ప ఇప్పుడు ఇదీ అంతే! అంతా రాధ అదృష్టమని మురిసి పోతున్నారు గానీ తెర వెనుక జరిగింది ఎవరికి తెలుసు.?

అయినా ఇలా ఎందుకు జరగాలి ? నేను నా పిరికి తనాన్ని వదులుకుని, కొంచెం ధైర్యం తెచ్చుకుని తీవ్రంగా ప్రతిఘటించి వుంటే భారతికి మేలు జరిగి వుండేది దాని భవిష్యత్తు ఉజ్వలంగా వుండేది లేదా భారతి ధైర్యంచేసి, తన స్వార్థం తను చూసుకుని వుండినా బావుండేది నాకీ క్షోభ తప్పేది రెండూ జరగలేదు కారణం ? ఇద్దరికీ అలా చెయ్యడానికి మా స్వభావాలు అడ్డం వచ్చాయి నేను నా పిరికితనం వదులుకోలేను. భారతి తన త్యాగబుద్ధి పోనిచ్చుకోదు. ఒకరి స్వభావం మరొకరికి రాదు. భారతిలో స్వార్థం తల ఎత్తదు. నాలో తెగించి త్యాగం చేసే గుణం రాదు. బ్రతుకు బాటలో ఎన్నో సంవత్సరాలు కలిసి పయనించినా ఒకరి భావాలు మరొకరికి రాలేదు. మేము ఎప్పటికీ కలవ లేము. పక్క పక్కనే పయనించే సమాంతర రేఖలం. అంతే !

# హార్లిక్స్

Horlicks

THE IDEAL FOOD DRINK

## ఆరోజుకు ఆరోజు రోగనివారణ శక్తిని పెంచి ఆరోగ్యాన్ని కాపాడే పౌష్టికాహారం.

హార్లిక్స్ నిత్యం సేవించినట్టయితే, మీ కుటుంబానికి రోగాలు రాకుండాతట్టుకునే శక్తి పెరుగుతుంది వారికి సంపూర్ణ-మయిన ఆరోగ్యం చేకురుతుంది ఆరోగ్యం మహాభాగ్యం

హార్లిక్స్, ప్రపంచం అంతటా డాక్టర్‌లు సిఫార్సు చేసేది ఇది ఒక్కటే. మీకు అత్యధికంగా పుష్టి ఇచ్చేది ఇది ఒక్కటే ఎందుచేతనంటే ఇందులోను సంపన్నమయిన స్వచ్ఛమయిన పదార్థలు; అపూర్వమయిన హార్లిక్స్ పద్ధతి ప్రకారం సమ్మిళితమితాయి దీనివల్ల వీటి సహజ సద్గుణాలు నష్టంకావు అవి సులువుగా జీర్ణం అవుతాయి

అందువల్లనే సుచిత్ర హార్లిక్స్‌ని తన కుటుంబ జీవితంలో భాగంగా చేసుకుంది

సుచిత్ర మోస్తరుగానే మీరుకూడా మీకుటుంబానికి ప్రతిరోజు హార్లిక్స్ ఇవ్వండి వారు ఆరోగ్యంగా, బలంగా పెరగడం మీకు కనబడుతుంది

"హార్లిక్స్ ప్రధానమయిన పుష్టి సాధనం. మీకుటుంబంలోనివారికి వ్యాధులు రాకుండా తట్టుకునే శక్తి పెరిగేందుకూ వారు ఆరోజుకారోజు ఆరోగ్యంగా, చురుగ్గా ఉండేందుకూ నేను హార్లిక్స్‌ను సిఫారుసు చేస్తున్నాను"



**హార్లిక్స్ మంచి పుష్టికరమైనది**

# రాగమాలిక

శ్రీమతి
మాదవపెద్ది పుణ్యశీలాప్రసాద్

తండ్రి — తమ్ముడు — సవతి తల్లుల మధ్య మరో అయిదేళ్ళు గడిచాయి రాధకు ఆ అయిదేళ్ళల్లో రాధ ఎస్. ఎస్ ఎల్ సి — పి యు. సి — బి ఏ కూడా పూర్తిచేసింది టైపు నేర్చుకుంది శ్రద్ధగా తదేక దీక్షతో చదవడంవల్ల పాస్ కాగలిగింది పరీక్షలన్నీ! తరువాత ఇంటి పనులు చేస్తూనే ఉద్యోగంలో చేరింది రాధ

ఒక కంపెనీలో సెక్రటరీగా మంచి జీతంతో చేరింది — ఆ చేరడం కూడా!

సంపాదిస్తున్న రాధని మరింత గౌరవంగా చూస్తోంది రాధ సవతితల్లి

చెప్పడం ఆపింది రాధ

చుట్టూ చీకట్లు కమ్ముకున్నాయి

అప్పటికి ఎనిమిదైంది టైము!

లేచి లైటు వేశాను తలుపు గడియ తీశాను

చెప్తున్న రాధ, వింటున్న నేనూగూడా గమనించలేదు అంత టైము గడిచిందని! భోజనానికి ఏర్పాట్లు చూడమని చెప్పాలి — భాగ్యమ్మగారికి

"నేను చెప్పాల్సింది చాలా వుందక్కా—"

"కానీ, నేను ఇంటికి వెళ్ళాలి ఆయన ఆయన"

రెండు చేతులూ ముఖాన కప్పకుని భోరున ఏడ్చింది మళ్ళీ రాధ ఏడ్చి—ఏడ్చి గొంతు రాచుకు పోయింది — ఏడుపు ధ్వని కూడా బయటికి రాలేదు

బయట కారాగిన చప్పుడయింది

నేను కదలబోయాను

చప్పున నా చెయ్యి పట్టుకుని ఆపి—"అక్కా! నేను ఆ భర్తతో . ఆ భర్తతో కాపురం చేసింది ఒకే ఒక నెల అంతే అక్కా — అంతే — కాపురం కాదది — ఆయన నన్ను బలాత్కరించాడని చెప్ప వచ్చు నేను ఏనాడూ ఆయన్ని ప్రేమించ లేదు భర్తగా చూడలేదు భావించలేదు భగవంతుడిసాక్షి... భగవంతుడిసాక్షి అక్కా — ఆయన నా భర్త కాదు కానేకాదు నేను ప్రేమించింది — పూజించేది ఈయన్నే అక్కా! రామాన్నే! ఈయనే నా భర్త! నా సర్వస్వం! నా కాపురం నువ్వే ... నువ్వే . . నిలబెట్టాలి..."

కన్నీళ్ళు గబగబా తుడుచుకుంది.

అంతలో రామం లోపలకి వచ్చేశాడు.

"రాధా! ఇక్కడున్నావా? నీకోసం

*(గత సంచిక తరువాయి)*

తెగవెతుకుతున్నాను ఎట్లా వచ్చావు ఇక్కడికి? రిక్షాలోనా? నువ్వీ స్థితిలో ఇట్లా తిరగ్గూడదు రాధా! నామాట వినవూ? నాకోసం నాకోసం రాధా! ఏమిటట్లా వున్నావు? అట్లా వాడిపోయిందేం ముఖం? ఏం మంజూ! ఏం నూరిపోస్తున్నావు మీ చెల్లెలికి?"

రామం ఇంత ఆప్యాయంగా చూసుకుంటుంటే రాధకి ఇంకా బాధ ఎందుకు? గతాన్ని తవ్వుకోడ మెందుకు? తన కాపురాన్ని నిలపమంటుందేమిటి? ఏమయింది కాపురానికి? లక్షణంగా వుంటేనూ? అయినా రామం ఎంత ఆదర్శ పురుషుడు! నూటికి ఒక్కరైనా రామంలాంటివాళ్ళు వుంటారా?

కన్నార్పకుండా రామాన్నే చూస్తున్నాను నేను.

"ఏమిటి మంజూ! అట్లా చూస్తున్నావు? దిష్టి తగులుతుందిసుమా మా యిద్దరికీ!" రాధ భుజంమీద చెయ్యివేస్తూ అన్నాడు

"టైముకే వచ్చావు రామం! భోజనాలకి ఏర్పాటులు చూస్తున్నాను మీ ఇద్దరూ భోజనంచేసే వెళ్ళండి" అంటూ డైనింగ్ రూముకేసి నడిచాను

భోజనం టైములో ఎవరం ఏమీ మాట్లాడ లేదు ఆ సంగతెత్తితే మళ్ళీ రాధ పరిస్థితి ఎట్లా వుంటుందోనని నేనూ మాట్లాడక వూరుకున్నాను

"రేపా రాధ ప్రయాణం?" అడిగాను నేను

ఒక పళ్ళెంలో రెండు జాకెట్టుగుడ్డలు, కొబ్బరికాయ పళ్ళు — పూలు పెట్టి — బొట్టు పెట్టి రాధ చేతికి అందించాను

"అసలు వెళ్ళనంటుంది మంజూ! నన్నొదిలి వుండలేదుట అందుకే తొమ్మిదోనెల వచ్చినా వెళ్ళలేదు చూడు పుట్టింటికి! నేనే బలవంతం చేస్తున్నాను వెళ్ళూ, అక్కడైతే నీకు రెస్టు వుంటుంది అని!"

అల్లరిగా అన్నాడు రామం

నవ్వింది రాధ ఆ నవ్వు వెలితిగా కనబడింది నాకు

నాకాళ్ళకి నమస్కారం చేసింది రాధ

ఏం భయంలేదన్నట్లు భుజంతట్టాను నేను

కృతజ్ఞతగా నవ్వింది

"భలే లాట్ కొట్టావే..." అన్నాడు రామం

"నువ్వూరుకో రామం" నవ్వుతూ అని — "రాధా! గుమ్మడిపండులాంటి కొడుకుని కనాలి తెలిసిందా?" అన్నాను బుగ్గన చిటికేస్తూ

పెద్దగా నవ్వాడు రామం

వింతగా చూశాను నేను.

"ఓకే మంజూ! గుడ్‌నైట్"

ఇద్దరూ కారెక్కారు కారు కదిలింది

ఆ రాత్రల్లా ఇదే ఆలోచన నాకు రాధ కథంతా రామానికి తెలుసా? తెలిసే చేసుకున్నాడా రాధని? చేసుకున్నాక సరిగ్గా చూడడంలేదా? బాగానే చూస్తున్నాడే!? అదంతా లేకపోతే ఎటనా? అతణ్ణి చూస్తుంటే ఎవరికీ ఎట్లాంటి అనుమానమూ రాదు బాగా చూస్తే రాధ కెందుకు మరి బాధ? ఇంకా ఆమె మొదటి భర్త బతికున్నాడా? వాళ్ళమీద రామాని కేమన్నా అనుమానమా? లేకపోతే తెలీక చేసుకున్నాడేమో? తెలిశాక ఇప్పుడు ఆమెని హింసిస్తున్నాడా? అతడి కళ్ళల్లో రాధపట్ల ఉన్న ఆపేక్ష — ప్రేమా ప్రతిఫలిస్తూ వున్నాయి యిప్పటికిగూడా! ఉహూఁ రామాన్ని నేను శంకించలేను

ఎట్లా ఆ తరువాత రాధ కథ తెలుసు కోవడం? రేపే వెళ్ళిపోతుందే! ఉత్తరం రాసి కనుక్కుంటేనో తన కాపురం నిలబెట్టమంది మొత్తం కథ తెలిస్తేనే కదా — నేనేమైనా చెయ్యగలిగేది? పాపం! ఎన్ని కష్టాలు అనుభవించింది రాధ? ఇప్పుడూ ఏదో సమస్య వుంది ఆమెకి దాన్ని తను పరిష్కరించుకోలేకపోతోంది ఏమిటది?

ఎప్పటికో పట్టింది నిద్ర

## 10

తరవాత కొన్నాళ్ళవరకు రాధ సంగతి నాకేమీ తెలియలేదు

రాధ వెళ్ళిందోలేదో కూడా తెలీలేదు నేనూ కాలేజీ గొడవల్లో బిజీగా వున్నాను

కానీ, రాధ సంగతి నా మెదడుని తొలుస్తూనేవుంది

ఆ రోజు ఆదివారం

సాయంత్రం నాలుగుగంటలకే తయారయి

**జరిగిన కథ - 4** నిద్రమాత్రలు వేసుకుంటేగానీ నిద్రపట్టని జీవితం మంజులది సంవత్సరమంతా అంధకారంలో గడిపే మంజుల జీవితంలోకి వెలుగుని తెస్తారు శలవులకి ఇంటికొచ్చే సుధ, మధులు కానీ అందులోనూ అసంతృప్తి కొడుకు వస్తే కూతురో, కూతురు వస్తే కొడుకో ఎవరో ఒకరు తండ్రి దగ్గర కెళ్ళిపోతారు ఇద్దరూ ఎప్పుడూ కలిసిరారు చిన్ననాటి స్నేహితుడు రామం కలసి గుర్తు పడ్తాడు మంజులని రామం భార్య రాధ బారసాల చేసుకున్న తర్వాత భార్య సుశీలని తీసుకుని చెల్లెలు మంజుల దగ్గరికి వస్తాడు రాజు మధు అనారోగ్యం మంజులని మరింతగా కృంగదీస్తోంది రామంతో పెళ్ళి కాకముందు తనకోసారి పెళ్ళయిందని రాధ నోట విని ఆశ్చర్యపోతుంది మంజుల

రాధ ఇంటికి బయల్దేరాను

ఇల్లు కళావిహీనంగా కనిపించింది నాకు. నా ఆలోచనలవల్ల నాకు అట్లా కనిపిస్తోందేమో అనుకున్నాను.

లోపలవరకు వెళ్ళినా ఎవరూ కనిపించలేదు. రాధ వుండదని తెలిసినా 'రాధా' అని పిలుస్తూ పడగ్గదిలోకి వెళ్లాను వాళ్ల పడగ్గదిలోకి వెళ్లడం నాకు అలవాటే!

రాధ, రామం, నేనూ అక్కడ గంటలతరబడి కబుర్లు చెప్పుకునేవాళ్లం రాధ వున్నప్పుడు అట్లా ఎన్నోసార్లు జరిగింది.

గదిలోకి అడుగుపెట్టిన నేను నిశ్చేష్టురాలినై పోయాను

అక్కడ రామం వున్నాడు!

కానీ, నేనెప్పుడూ చూసే రామం కాదు

గడ్డం బాగా పెరిగివుంది.

కళ్లు ఎర్రగా వున్నాయి.

సిగరెట్లమీద సిగరెట్లు కాలుస్తున్నాడు.

బల్లమీద విస్కీబాటిల్, గ్లాసూ వున్నాయి

ఏమిటీ తాగుడు? అందరికీ ఇదే జబ్బా? లేకపోతే ఫాషనా? ఎంతమంది జీవితాన్ని నాశనం చేస్తుందీ తాగుడు? రాధ తండ్రి — రాధ మొదటి భర్త — రెండవ భర్తా కూడా . ఇంకా ఆపైన ఆలోచించలేకపోయాను.

నాకసలా తాగుడంటేనే అసహ్యం.

తాగేవాళ్లంటే ఇంకా అసహ్యం

నా ఆలోచనలలో నేనున్నాను

రామం ఎప్పుడు మంచమీది నుంచి లేచాడో నేనసలు గమనించనేలేదు

నేనట్లా మంచునేవున్నాను — పరధ్యానంగా

"నా రాధా! వచ్చావా?" అంటూ అమాంతం నన్ను కావలించుకున్నాడు. నేను ఉలిక్కిపడ్డాను.

ఉక్కుముక్కల్లా వున్న ఆ చేతుల్లోంచి విడిపించుకోడం నాకు సాధ్యంకాలేదు

"రాధా! వన్నొదిలి వెళ్లకు. వెళ్లకు రాధా . నన్ను క్షమించు — క్షమించు. ."

నా తలమీద గడ్డం ఆన్చుకుని గొణుగుతున్నాడు. చేతులు నన్ను చుట్టేవున్నాయి.

మధు నా దగ్గిర చేరినట్లు వుంది నాకు రామం మీద చాలా జాలేసింది

మెల్లిగా 'రామం —' అన్నాను.

రామం ఉలిక్కిపడ్డాడు

మరుక్షణం నిప్పుని ముట్టుకుని వదిలేసినట్లు నన్ను గబుక్కున వదిలేశాడు.

"మంజూ — నువ్వా?"

"అవును రామం—నేనే—ఏమిటీ పని? రాధకి ఏమైంది?"

"అయామ్ సారీ—మంజూ, రాధే ననుకుని. సారీ నన్ను క్షమించు... క్షమించానను. పొరపాటు — చాలా పొరపాటు చేశాను. తప్పవని చేశాను . నువ్వనుకోలేదు మంజూ — నిజంగా నేను కావాలని చేశానని నువ్వనుకోవడంలేదు కదా? చెప్పు మంజూ. ప్లీజ్"

కంగారుగా అన్నాడు

కుంచించుకుపోతూ అన్నాడు

సిగ్గుతో చితికిపోతూ అన్నాడు

"లేదు రామం... నిన్ను నేనెప్పుడూ అపార్థం చేసుకోను కానీ, ఈ అలవాటేమిటి రామం? దీనివల్ల ఎన్ని అనర్థాలో ఆలోచించావా? ఎప్పట్నించి వుంది నీకీ అలవాటు? చెప్పు — రాధకి తెలుసా నువ్వు తాగుతావని?"

"తెలుసు రాధని పెళ్లి చేసుకున్నప్పటినించీ ఈ అలవాటు చేసుకున్నాను విదేశాలకి వెళ్లాక దాన్ని ఎక్కువ చేసుకున్నాను"

తల వంచుకుని చెప్తున్న రామాన్ని చూస్తే ఆశ్చర్యం వేసింది

"నేను కధ చెప్తాను వింటావా?" తల పైకెత్తి హఠాత్తుగా అన్నాడు

కళ్లు విషాదంగా వున్నాయి

"ముందు నువ్వు వెళ్లి మొహం కదుక్కుని— ఆ మత్తు పోగొట్టుకుని రా — అప్పుడు నువ్వేం చెప్పినా వింటాను —"

నేను చెప్పినట్లే చేశాడు రామం

లోపలికెళ్లి అత్తయ్యగారి నడిగి రెండు కప్పుల కాఫీ చేసి తీసుకువచ్చాను ఇద్దరం చెరో కప్పూ తీసుకున్నాం

అప్పటికి రామం కుదుటబడ్డాడు

ఇద్దరం ముందు రూమ్‌లో కొచ్చి కూచున్నాం

కధ మొదలుపెట్టాడు రామం —

నేను శ్రద్ధగా వినసాగాను

"నేను ఉద్యోగంలో చేరి రెండేళ్లయింది అప్పటికి సెక్రెటరీగా ఆ రోజే మా ఆఫీసులో ఒక అందమైన అమ్మాయి చేరింది. చేరిన రోజే ఆ అమ్మాయి నా దృష్టి నాకర్షించింది

ఆ వయసులో మగవాళ్లు ఏ అందాన్ని చూసినా అడ్మైర్ చేస్తారనుకుంటాను. అట్లాగే నేనూను. రోజూ ఆమె అందాన్ని చూస్తూ స్మరించుకుంటూ వుండేవాడిని.

కొన్నాళ్లకి నాకు మానేజరుగా ప్రమోషన్ వచ్చింది

ఆ అమ్మాయి డైరెక్ట్‌గా నాకిందికే వచ్చింది. నేనెంతో సంతోషించాను దానికి

నేను ఆమెకి ఎన్నో డిక్టేటు చెయ్యాల్సి వచ్చేది. ఆ సన్నటి వేళ్లను — చేతుల అందాల్ని చూస్తూవుండేవాణ్ని దాదాపు ఆరునెల్లు అట్లా మూగగా ఆరాధించాను ఆమెని

ఆమె రాధ!

అంతదాకా ఆఫీషియల్‌గా తప్ప వ్యక్తిగతంగా మాకు పరిచయాలు లేవు. అప్పుడప్పుడూ అవసరానికి మాట్లాడుకునేవాళ్లం

ఒకసారి అనుకోకుండా ఒక సినిమాలో కలిశాం మేము హఠాత్తుగా కరెంటుపోయి — ఎంతసేపటికీ రాలేదు ఆరోజుకి ఆ 'షో' కాన్సిలయింది. అందరూ లేచారు రాధ వెళ్లబోతుంటే నేనే ఆపాను లిఫ్ట్ ఇస్తానన్నాను



కారు ఎక్కింది రాధ ఆరోజు రాధ సరసన నేను ఏవేవో ఊహాలోకాల్లో తేలిపోయాను. పట్టుకోనీ పట్టుకోనట్టు ఆమె చేతిని పట్టుకున్నాను 'బాస్'వనో—ఏమోగానీ, రాధ నన్ను వారించలేదు ఇంటికి వెళ్లకుండా పార్కుకి తీసికెళ్లాను రాధని రాధ ఏమనలేదు. కాసేపు కబుర్లాడుకున్నాం.

అంతకంటే నేనే ఏవేవో మాట్లాడాను. ఆమె వింది అంటే బావుంటుంది తరవాత ఆమెని ఇంటి దగ్గిర డ్రాప్ చేశాను.

"ఇట్లా నాతో అప్పుడప్పుడు బయటికి రావడానికి అభ్యంతరమా?" అడిగాను నేను.

రాధ ఏమీ మాట్లాడలేదు.

మౌనం అర్ధాంగీకారంగా తీసుకుని అప్పుడప్పుడూ చెప్పకుండానే — పార్కులకి — హోటళ్లకి — కాఫీ టిఫిన్లకి మాత్రమేలే — తీసికెళ్తుండేవాడిని. తనూ ఎట్లూ చెప్పలేక







మౌనంగా వుండిపోయేది.

అట్లా మరో ఆర్నెల్లు గడిచాయి.

కానీ, మా పరిచయం అట్లాగే వుండి పోయింది. మేము — నేను అనుకున్నంతగా దగ్గరికి రాలేదు. రాధ ముభావంగానే వుండేది. ఎంతో అవసరమైతేనే తప్ప మాట్లాడేదికాదు. ఎంత నవ్వించినా మనసారా నవ్వేదికాదు. ఎప్పుడూ ఏదో పోగొట్టుకున్నట్లుండేది.

కానీ అదే — ఆ స్వభావమే ఆమెకి అందంగా — ఆభరణంగా వుండేది. నన్ను మరీ ఆకర్షించింది.

చిన్న చిన్న కానుకలనైనాకూడా తీసుకునేదే కాదు. మౌనంగానే తిరస్కరించేది. తన హద్దుని ఎప్పుడూ దాటేదికాదు.

ఒక రోజు అలవాటు ప్రకారం రాధని పార్కుకి తీసికెళ్లాను. ఆమె మౌనంగా ఒక బెంచీ మీద కూచుంది. ఆ రోజు చాలా అందంగా కనబడింది నా కళ్లకు. అరవిచ్చిన గులాబులు వల్లగాలికి నాట్యం చేస్తున్నాయి. రంగు రంగుల కాంతుల్ని వెదజల్లుతున్న ఆ పూలని చూస్తున్న రాధ పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి.

అదే — ఆ చిరునవ్వు కోసమే నేను ఎన్నో రోజుల్నించి తపస్సు చేస్తున్నాను. నా తపస్సు ఫలించింది! ఇంక నేను ఆ చిరునవ్వు చూసి ఊరుకోలేకపోయాను. చటుక్కున ఆమె పాదాల దగ్గరే కూచుని ఆ పాదాలమీద చేతులుంచాను.

ఆమె దిగ్భ్రాంతురాలై కాళ్లు పైకి పెట్టుకుని కూచుంది.

నేను ఆమె కళ్లలోకే తదేకంగా చూస్తూ — ''రాధా — నేను నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను. నువ్వంగీకరిస్తే పెళ్లి చేసుకుంటాను.'' ఆవేశంగా అన్నాను.

రాధ ఒక్కసారిగా ఉలిక్కిపడింది. మొహం వివర్ణమయింది.

మోకాళ్ల మధ్య తల దూర్చి వెక్కి వెక్కి ఏడ్చింది. ఎందుకో నాకు అర్థం కాలేదు.

నేనేమన్నా తప్పుమాట అన్నానేమోనని హడలిపోయాను. కానీ, ఆమెని తాకి ఓదార్చే ధైర్యం నాకు లేకపోయింది.

చాలాసేపు అట్లాగే ఏడుస్తూ వుండిపోయిందామె.

నేనట్లాగే చూస్తూ వుండిపోయాను.

తరవాత కళ్లు తుడుచుకుని లేచి — వెళ్లిపోయింది. వంచిన తలకూడా ఎత్తలేదు! నావైపు అసలే చూడలేదు!

ఆ రోజుకింక నేనుకూడా ఆమెని వారించలేదు. ఇంటికి వెళ్లిపోయాను అన్యమనస్కంగా

ఆరోజు నాకు నిద్రపట్టలేదు.

ఎందుకట్లా ఏడ్చిందామె ?

ఇష్టంలేకపోతే లేదని చెప్పవచ్చుగా ?

ఏమైనాసరే. ఆ తరువాత రోజు వాళ్లింటికి వెళ్లి ఏ విషయమూ కనుక్కోవాలి. నిశ్చయించుకున్నాను. తెల్లవారింది.

ఆ సాయంత్రం మొదటిసారిగా వాళ్లింటికి వెళ్లాను. వాళ్ల తమ్ముడు రాధ ఇంట్లో లేదని చెప్పాడు.

ఆరోజు రాధ ఆఫీసుకి కూడా రాలేదు.

నన్ను చూడడం ఇష్టం లేదేమో ?

''మీ నాన్నగారు ఉన్నారా ?'' అడిగాను.

ఉన్నారన్నట్లు తల ఊపాడు. నేను అక్కడే కుర్చీలో కూచున్నాను.

రాధ తండ్రి బయటికి వచ్చాడు.

నేను నమస్కారంచేసి నన్ను నేను పరిచయం చేసుకున్నాను. ఆయన తత్తరపడి భార్యని పిలిచాడు.

ఆవిడ వచ్చింది

'రాధని పిలు.' అన్నాడు.

''రాధ లేదండీ! ఇప్పుడే డాక్టరుగారి దగ్గరికి వెళ్లింది.'' అందావిడ.

''వీరెవరో తెలుసా ? మనమ్మాయి పని చేసే ఆఫీసు మానేజరుగారు.'' అన్నాడాయన.

నేను ఆవిడకి నమస్కారం చేశాను.

కాఫీ తెమ్మన్నాడాయన. ఆవిడ లోపలికి వెళ్లింది. మేమేమీ మాట్లాడుకోలేదు కొంచెంసేపు.

అయిదు — పదినిమిషాల అనంతరం ఆవిడ కాఫీకప్పులతో తిరిగివచ్చింది. మా యిద్దరికీ అందించి తనూ అక్కడే కూచుంది.

నేను వాళ్లకి నా వివరాలన్నీ చెప్పి — ''మీకు



తుఫాన్ నిధికిగాను ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారికి రు. 1,30,000లు చెక్కు సమర్పిస్తున్న అమృతాంజన్ లిమిటెడ్ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ శివలెంక నాగేశ్వరరావుగారు.

మీకు అభ్యంతరం లేకపోతే నేను రాధని పెళ్లి చేసుకోవాలనుకుంటున్నాను.'' అన్నాను.

రాధ తల్లీ తండ్రీ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. కాసేపు మౌనంగా వుండిపోయారు.

''రాధ కథ నీకు తెలీదు బాబూ! తెలిస్తే ఈమాట అనవు.'' రాధ తండ్రి కంటతడి పెట్టాడు.

'మీరే కథ చెప్పినా నా నిర్ణయం మారదు.' అంటోంయి ఊరుకున్నాను.

''చెప్పండి అంతా! తెలిశాక ఆలోచిస్తాం.'' అంది ఆయన భార్య.

ఆయన చెప్పడం ప్రారంభించాడు

ఆయన చెప్పిన మొదటిమాట ఏమిటో తెలుసా మూర్తీ ? ''రాధకి అంతకుముందే పెళ్లయిందిట !''

ఆపి నావైపు చూశాడు రామం.

నాకు ముందే తెలుసుగా ? నేను ఆశ్చర్యపోలేదు.

నేను ఆశ్చర్యపడలేదని రామం ఆశ్చర్యపోయాడు.

కాసేపు నావైపు తదేకంగా చూశాడు.

మళ్లీ మొదలుపెట్టాడు.

''పెళ్లయ్యాక రాధ అతడితో కాపురం చేసింది ఒక నెలేట. ఉన్నది ఆరునెలలుట అతడితో. మరి ఆయనకే రాధంటే ఇష్టంలేదో — రాధకే ఆయనంటే పడలేదో — రాధ వచ్చేసింది విడాకులు తీసుకున్నారు. ఆయన రాధని కొట్టి తిట్టి హింసించేవాడుట. ఇందులో రాధ తప్పు రవ్వంతైనా లేదంటాడు రాధ తండ్రి. ఆయనకి అన్ని వ్యసనాలూ వుండేవనీ, అయినా రాధ భరించిందనీ, చివరికి ఎవరినో తెచ్చి ఇంట్లో పెట్టినా రాధ పెదవి కదపలేదట. అంతా తన 'ఖర్మ' అనుకుందిట! ఏదైతేనేం ? రాధకి తన భర్తతో ఇప్పుడు ఏలాటి సంబంధమూ లేదు. వాళ్లు విడాకులు తీసుకుని అయిదేళ్లయింది. ఇదీ రాధ తండ్రి చెప్పినదానికి సారాంశం.

తన తదనంతరం రాధ ఏమైపోతుందోనని రాధ తండ్రి దిగులు. ''ఎంత ఉద్యోగం చేస్తున్నా మగతోడులేని ఆడదంటే అందరికీ లోకువేగదా బాబూ!'' అన్నాడు.

ఈ మాటలకి నేను ఉలిక్కిపడి సర్దుకున్నాను. రామం నన్ను గమనించలేదు.

అంతా చెప్పి ఆయన ''నాయనా — నీ కిష్టమైతే — జాలి కలిగితే, రాధని పెళ్లి చేసుకో - నాకేమీ అభ్యంతరం లేదు.'' అని నిట్టూర్చాడు.

నేనేమీ చెప్పలేకపోయాను. మౌనంగా లేచి వచ్చేశాను.

ఆరోజూ — మర్నాడూకూడా తిండీ — నీళ్ళూ సయించలేదు. నిద్రలేదు.

"ఛీ ఛీ! పెళ్లయినదాన్ని వెనకా ముందూ చూడకుండా నేనెట్లా ప్రేమించాను? ఎంత అమాయకంగా వుంటుంది? ఎవరైనా పెళ్లికాని పిల్ల అనే అనుకుంటారు. ఒకసారి వాసన చూడ బడిన పువ్వు!

కొన్నాళ్ళు మరొక వాగవాడిలో వున్న మగువ! నాకు తొలి పెళ్లి!

వేరొక భర్త సరసన కూర్చుని మంగళ సూత్రం కట్టించుకుంది!

వాడికి సపర్యలు చేసింది.




వాడి భార్యగా నలుగురిలో మెలిగింది.

వాడితో జీవితాన్ని పంచుకుంది.

వాడితో... వాడితో... వాడితో... అన్నీ వాడితోనే...

వాసన చూసి... నలిపి... నేల రాసేశాడా దుర్మార్గుడు.

ఆ పువ్వుని — నేను స్వీకరించగలనా? మళ్లీ సుగంధం వెదజల్లేటట్లు చెయ్యగలనా? అసలు నలిగిన పువ్వు మళ్లీ మామూలుగా ఎట్లా కాగలదు? వాడిపోయి — ఎండిపోవాల్సిందేనా?

అయినా నాకేం ఖర్మ?

నేను 'కో' అంటే నా ఆస్తి — అంతస్థు — ఐశ్వర్యం — చదువు — ఉద్యోగం చూసి కోటి సంబంధాలు వస్తాయి.

వద్దు. నాకు రాధ వద్దసలే!

మర్చిపోవాలి. తనని మర్చిపోవాలి. అని నిర్ణయించుకున్నాను.

వారం గడిచింది.

జబ్బుపడి లేచినవాడిలాగా తయారయ్యాను.

## రాగమాలిక

ఈ వారంలోనూ ఎన్నో నేను తెలుసుకున్నాను.

రాధ లేనిదే నేను లేను.

రాధని వదిలి నేను వుండలేను.

రాధే నేను — నేనే రాధ.

ఆమె గతంతో నాకు పని లేదు.

ఆమె అంగీకరిస్తే అంతే చాలు!

అంతే — ఆరోజే రాధతో మాట్లాడాను.

నన్ను పెళ్లాడడానికి రాధ చివరికి ఒప్పుకుంది.

"మరి నేను..." ఇంకా ఏమిటో చెప్పబోయింది.

"నువ్వింక నాకేమీ చెప్పద్దు రాధా! నువ్వు నాకు కావాలి అంతే." అన్నాను.

"కానీ, మీరు తరవాత బాధపడరుగదా?" అడిగింది.

"ఊహూఁ!"

ఆ తరవాత రెండు మూడు నెలలకే మా పెళ్లి జరిగింది.

నా జీవితంలో ముఖ్యమయిన మలుపు అది.

పెళ్లినాటినించే నాలో రాక్షసుడు ప్రవేశించాడు.

"మొదటిసారిగూడా ఇట్లాగే తల వంచావా?" మంగళసూత్రం కడుతూ — మెల్లగా అడిగాను.

అన్ని మంత్రాలఘోషలో, మేళాల మోతలో రాధకి నా మాట - వినిపించిందో లేదో మరి!

నావైపే చూడలేదు.

బిందెలో మట్టె— ఉంగరం తీస్తున్నప్పుడు. "మీ ఇద్దరిలో ఎవరు గెల్చారు?" రహస్యంగా అడిగాను.

కళ్ళు వాల్చేసుకుంది.

ఆ రాత్రి —

"పెళ్లవంగానే చేశారా మీకు కార్యం?" నా తొలి ప్రశ్న అది — మొదటి రాత్రి?

"... ... ..." సమాధానం చెప్పలేదు.

"అప్పుడూ యిట్లాగే సిగ్గుపడ్డావా?"

"... ... ..." బిత్తరపోయి చూసింది.

భుజంమీద చెయ్యి వేస్తే మెల్లిగా తీసేసింది.

"అవునులే — నీకు కొత్తకాదుగా? కోరికలేం వుంటాయి?" బాధగా చూసింది రాధ.

అంతలోనే నిశ్చయం కనబడిందా మె మొహంలో. నన్ను చేరింది. నేనింక మాట్లాడలేక పోయాను.

అయితే ఎప్పుడూ ఏదో ఒకటి అంటూ బాధిస్తూనే వుండేవాణ్ణి నేను. ఆమె బాధపడు తుంటే చూడాలనికాదు మళ్లీ!

"అసలు ఆడవాళ్లు రెండు పెళ్లిళ్లు ఎట్లా చేసుకుంటారో?"

"మీ కుటుంబంలో ఇదే అలవాటేమోలే కదూ? మీ నాన్నా అంతే."

"ఆయన మీ అమ్మ పోయాక రెండో పెళ్లి చేసుకుంటే నువ్వు మొదటి మొగుడు వుండంగానే నన్ను కట్టుకున్నావు."

కాస్త పరధ్యానంగా వుంటే—

"ఏం ఆ మొగుడు గుర్తొచ్చాడా? ఆ జీవితం గుర్తొచ్చిందా?" ఎగతాళిగా అడిగేవాణ్ణి.

ఎందుకోమరి రాధ మొహం చూస్తేనే భరించలేని అసహ్యం వేసేది.

మళ్లీ ఆమెని చూడకుండా క్షణం వుండలేక పోయేవాణ్ణి.

పగలు ఎంత చీదరించుకున్నా రాత్రి మాత్రం రాధ నాకు అంతులేని సుఖశాంతులనిచ్చేది. అప్పుడు ఆ అమాయకమైన కళ్లు చూస్తూ—ఆ చిరునవ్వు చూస్తూ — ఎంతో బాధపడేవాణ్ణి ఎందుకు రాధని బాధపెట్టడం? ఏ పాపం ఎరగదు రాధ. ఎప్పుడో జరిగిపోయినదానికి రాధని యెందుకు కష్టపెట్టడం? పువ్వులాగా చూసుకోవాలి అని నిశ్చయించుకునేవాణ్ణి — అమాయకంగా నిద్రించే ఆమె ముఖం చూస్తూ.

కానీ తెల్లవారుతూనే నా నిర్ణయాలన్నీ గాలిలో కలిసిపోయేవి.

"ఎక్కడ చచ్చావు — ఏయ్. రాధీ..." పరుగున వచ్చేది రాధ.

"ఆ మొగుడు — ఈ మొగుడుల అలవాట్ల మధ్య తేడాలలో సతమతమౌతున్నట్లున్నావే — పొద్దున్నే నేను బెడ్ కాఫీ తాగుతాను కదా — ఆమాత్రం తెలీదూ? ఏదీ కాఫీ?"

వళ్లు మర్చిపోయి మాట్లాడేవాణ్ణి.

కాఫీ ఎదురుగుండానే వుండేది.

"ఇదిగో — నేను ఆఫీసుకి వెళ్లాలి. నువ్వు ఎదురు రావద్దు. తెలిసిందా? నీ ఏడుపు మొహం చూస్తే నేను యాక్సిడెంటయి చస్తానుగూడా..."

మొహం మాడిపోయేది రాధకి.

"ఏం మొహం చాటంతయింది? మొదటి మొగుడి సంగతులేమన్నా తెలిశాయా?"

ఎన్ని మాటలన్నా — ఎంత హేళన చేసినా గుడ్ల నీళ్లు గుడ్లల్లో కుక్కుకునేదేగానీ, ఒక్క మాట పలికేది కాదు రాధ. అది నన్నింకా రెచ్చగొట్టేది.

[33వ పేజీ చూడండి]

# జి. వి. జి. పేజీ

## జాతీయ సమైక్యతకు చలనచిత్రాల దోహదం

"జాతీయ సమైక్యతకు చలనచిత్రాలు ఎంతవరకు తోడ్పడతాయో తెలుసుకోవాలంటే మీకు మా చిత్రంలోని ఫస్ట్ సాంగ్ పిక్చరైజేషన్ చూస్తే చాలు" అన్నాడో నిర్మాత ఇటీవల. "ఏమిటి విశేషం ?" అన్నాను కుతూహలంతో. "కథ ప్రకారం మా హీరోయిన్ నెల్లూరు ప్రాంతపు ఆడినాసి. సంభాషణలకర్త ఆమెచేత తూర్పు భాష మాట్లాడిస్తాడనుకోండి. కవి తెలంగాణా యాసలో రాశాడా పాట. ఇక ఆమెకు దుస్తులు. మా ఆర్ట్ డైరెక్టరేమో కాశ్మీరీ వనితలా స్కెచ్ వేశాడు. కాస్ట్యూమ్ డిపార్ట్‌మెంట్ వారు లంబాడీ డ్రస్సులా దాన్ని ఇంప్రూవ్ చేశారు. అదీ ఎలాగంటే — రాజస్థాన్ చోళీ, మలబారు వనితలా కొంగు వుండదు. ఆ హీరోయిన్‌కు గుజరాతీ వనితలా చిన్న బొజ్జ వుంటుందనుకోండి. పంజాబీ షూస్ తొడుక్కొని, ఆంగ్లో ఇండియన్ వనితలా నడుముకుంటూ వచ్చి, పాట అందుకుంటుంది. మొదటి చరణంలో కథక్, రెండోవ చరణంలో కూచిపూడి, మూడవ చరణంలో భాంగ్రా, నాల్గవ చరణంలో కథాకళి, ఐదవ చరణంలో భరతనాట్యం చేసేస్తుంది. ఇవన్నీ మైసూరువద్ద ఔట్‌డోర్ షూటింగ్. ఇంతలో విలన్ వచ్చి ఆమెను అడ్డగిస్తే, అతనితో కరాటే, జూడో ఫైట్లు చేసి తరిమేస్తుంది ... చలనచిత్రాలు జాతీయ సమైక్యతకు తోడ్పడతాయనడానికి యింతకన్నా నిదర్శనం ఇంకేం కావాలి ?" అన్నాడా నిర్మాత.

## దేవేంద్ర ఆర్ట్ పిక్చర్స్

"సింగీతం శ్రీనివాసరావుగారి దర్శకత్వంలో జనవరి 18 నించి కొత్త చిత్రాన్ని ప్రారంభిస్తున్నాను," అన్నారు నిర్మాత ఏకామ్రేశ్వరరావు. దేవేంద్ర ఆర్ట్ పిక్చర్స్ పతాకంలో తయారయ్యే ఈ చిత్రంలో సత్యనారాయణ, రంగనాథ్, రాజ్‌బాబు, మోహన్‌బాబు, మాడా, రావికొండలరావు, పి. ఎల్. నారాయణ, హైదరాబాద్ కె. వి. చలం, జయమాలిని, లీలావతి, రమాదేవితోపాటు నాయికగా రాజీ అనే సరికొత్త నటి పరిచయం గావింపబడుతుంది. కథ, మాటలు : గొల్లపూడి. సంగీతం : సత్యం. ఛాయ : మల్లికరాని. శిల్పం : అనంతరాంసింగ్. కూర్పు : బాబు. మార్చి 15 కి షూటింగ్ పూర్తవుతుంది.

## పతాక సన్నివేశంకోసం గాస్‌బెలూన్

అన్నపూర్ణా స్టూడియోస్ అండ్ జగపతి ఆర్ట్ పిక్చర్స్ పతాకంతో నిర్మాత వి. బి. రాజేంద్రప్రసాద్ దర్శకత్వం వెలుపే "రామకృష్ణులు" సినిమాస్కోప్ వర్ణ చిత్రంలో పతాక సన్నివేశాన్ని మున్నెన్నడూ కనీ వినీ ఎరుగని వినూత్న పంథాలో గగుర్పాటు కలిగించేలా చిత్రీకరించడంకోసం చాలా ఖరీదైన ఒక గాస్ బెలూన్‌ను కొనడం జరిగింది. ఎన్. టి. ఆర్., ఎ. ఎన్. ఆర్., సత్యనారాయణ, గుమ్మడి, అల్లురామలింగయ్య, మోహన్‌బాబు, శరత్‌బాబు, జయప్రద, జయసుధ, పుష్పలత ముఖ్యగువారు పాల్గొనే ఈ చిత్రానికి గుహనాథన్ విశిష్టమైన ఇతివృత్తాన్ని రూపొందించారు. ఆత్రేయ మాటలు, పాటలు, మహదేవన్ సంగీతం, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయ, ఎస్. కృష్ణారావు శిల్పం, హీరాలాల్ నృత్య దర్శకత్వం, ఎ. సంజీవి కూర్పు, దాసు సాహసాలు ఇతర అలంకారాలు.

## తుఫాన్ దెబ్బకు థియేటర్ల నష్టం

గుంటూరు జిల్లాలో 36, కృష్ణాజిల్లాలో 16, పశ్చిమగోదావరి జిల్లాలో 4, ప్రకాశం జిల్లాలో 8 — యిలా మొత్తం 75 సినిమా థియేటర్లలో కొన్ని పూర్తిగా నేలమట్టంకాగా, మరికొన్ని కొంతభాగం కూలిపోయాయి. మొత్తం 30 లక్షల రూపాయల నష్టం వాటిల్లినట్లు అంచనా. రాష్ట్ర చలనచిత్ర పరిశ్రమాభివృద్ధి సంస్థ 2 లక్షల 75 వేల రూపాయలను నిర్మాణానికి ఋణసాయం చేసిన గుంటూరు జిల్లా తుళ్ళూరులోని లక్ష్మీటాకీస్ పూర్తిగా కూలిపోయింది. గత అక్టోబర్ 31 న ఈ థియేటర్ నిర్మాణం ప్రారంభమైంది. 3 లక్షల నష్టం వాటిల్లింది. అలాగే గుంటూరు జిల్లా పొన్నూరులో త్వరలో నిర్మాణం పూర్తికానున్న అన్వార్ థియేటర్, నిజాంపట్నంలోని విజయలక్ష్మి సినిమాహాలు కూడా ఇటీవల సంభవించిన తుఫానుకు తీవ్రంగా గురి అయ్యాయి.

## టెక్నోవిషన్ స్కోప్ లెన్స్‌లో చిత్రం

శ్రీ పద్మావతి పిక్చర్స్ బానర్‌పై ఎ. మల్లికార్జునరావు దర్శకత్వంలో కృష్ణ సమర్పించే "దొంగల దోపిడి" టెక్నోవిషన్ స్కోప్‌లో తయారయ్యే తొలి తెలుగు చిత్రం. "ఈ చిత్రంలో థ్రిల్స్‌తోపాటు మంచి సెంటిమెంట్ కూడా వుండడం మరో విశేషం," అన్నారు నిర్మాత ఉప్పలపాటి సూర్యనారాయణబాబు. మదనపల్లి సమీపాన ఔట్‌డోర్ షూటింగ్ అనంతరం తమిళనాడులోని బోనకల్ గ్రామంలో మరో భారీ సెట్ వేసి నిర్మాణం జరిగే ఈ వర్ణ చిత్రంలో సత్యం, శివం, సుందరంలుగా కృష్ణ, మురళీమోహన్, శ్రీధర్ నటిస్తున్నారు. ఇంకా త్యాగరాజు, మోహన్‌బాబు, గిరిబాబు, రమణమూర్తి, కాంచన, రమాప్రభ కూడా వున్నారు. కథ, మాటలు : ఆదుర్తి నరసింహమూర్తి, సంగీతం : సత్యం ఛాయ : పుష్పాల గోపీకృష్ణ, శిల్పం : కె. రామలింగేశ్వరరావు. కూర్పు : కోటగిరి గోపాలరావు. నిర్వహణ : జి. సత్యరాజు, నిమ్మగడ్డ జనార్దనరావు. అసోసియేట్ డైరెక్టర్లు : ఎం. మధుసూదనరావు, రాయప్రోలు, గోపి.

## శోభన్‌బాబు కొత్త చిత్రాలు

దుక్కిపాటి మధుసూదనరావు నిర్మించే అన్నపూర్ణా వారి కొత్త చిత్రంలో, కామినేని ప్రసాద్, కానూరి కృష్ణ నిర్మించే లక్ష్మీరమణ కంబైన్స్ వారి చిత్రంలో, డి. రామానాయుడు నిర్మించే సురేష్ వారి తదుపరి చిత్రంలో శోభన్ హీరో.

## దేవర్ తెలుగు చిత్రాలు

వన్యమృగాలతో చిత్రాలు తీయడంలో తనకు తానే సాటి అనిపించుకున్న ఎం. ఎం. ఎ. చిన్నప్ప దేవర్ తమిళ చిత్రాలు లోగడ కొన్ని తెలుగులో డబ్ చేయబడ్డాయి, మరికొన్ని పునర్నిర్మింపబడ్డాయి. ఇప్పుడాయన తెలుగులో కూడా చిత్ర నిర్మాణానికి పూనుకున్నారు. "మా" హిందీ చిత్రాన్ని తెలుగులో ఎన్. టి. ఆర్, జయప్రదలతో నిర్మిస్తారు. "ఆట్టుకార అలమేలు" తమిళ చిత్రాన్ని మురళీమోహన్, ప్రభాకరరెడ్డి, రావుగోపాలరావు, మోహన్‌బాబు, శ్రీప్రియ ముఖ్యగువారితో తీస్తారు. దీనికి ఆయన అల్లుడు ఆర్. త్యాగరాజన్ దర్శకుడు; మహదేవన్ సంగీత దర్శకుడు, వి. రామమూర్తి ఛాయాగ్రాహకుడు.

## మన్మథలీల హిందీలో

తెలుగు తమిళ భాషల్లో అఖండవిజయం సాధించిన "మన్మథలీల" చిత్రాన్ని హిందీలో హైదరాబాద్‌కు చెందిన ప్రముఖ పంపిణీదారులు దామరాజు సత్యనారాయణమూర్తి జగదీశ్వర పిక్చర్స్ పతాకంతో నిర్మిస్తున్నారు. చక్రవర్తి సంగీత దర్శకుడు, కె. బ్రహ్మయ్య సహనిర్మాత, దసురాజు హనుమంతరావు నిర్వాహకుడు...

## లక్ష్మీనరసింహస్వామి ప్రొడక్షన్స్

దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో ఎం. కె. సూర్యనారాయణ నిర్మించే చిత్రం త్వరలో సెట్స్‌కు వెళ్తుంది. ★

"రాముడు బావ"లో జయసుధ, శోభన్





'అల్లరిబుల్లోడు'లో...



'ఆడదంటే అలుసా ?'

**రాముడు కాదు కృష్ణుడు**

శ్రీ దాసరి... శ్రీ అక్కినేని కాంబినేషన్‌తో "దేవదాసు మళ్లీ పుట్టాడు" వర్ణచిత్రాన్ని నిర్మిస్తున్న దేవీ ఆర్ట్ ప్రొడక్షన్స్ నిర్మాత శ్రీనివాసులుగారికి, అగ్ర దర్శకుడు శ్రీ దాసరి మరో మంచి కథను సమకూర్చారు చిత్రం పేరు "రాముడు కాదు కృష్ణుడు" చిత్ర నాయకుడు శ్రీ నాగేశ్వరరావు.

**విదేశాల్లో నాగేశ్వరరావు చిత్రం**

విజయమాధవీ పిక్చర్స్ శ్రీ నాగేశ్వరరావుతో "ఆత్మీయుడు" చిత్రాన్ని నిర్మించి తుఫాన్ రోజుల్లో విడుదల చేసినా... ఆర్థిక విజయాన్ని సాధించడం, ముదావహం.

శ్రీ అక్కినేనితో కొత్తతరహా చిత్రాన్ని, శ్రీ తాతినేని రామారావు దర్శకత్వంలో సెప్టెంబర్ నుంచి ప్రారంభించబోతున్నట్టు, ఆ చిత్రాన్ని విదేశాలలో ప్లాన్ చేస్తున్నట్టు, శ్రీ వడ్డె రమేష్ తెలిపారు.

"సింగపూర్... సిలోన్... మలేషియా" దేశాలలో శ్రీ అక్కినేనీ పాల్గొనే శృంగార గీతాలను, పతాక సన్నివేశాలను చిత్రీకరించడం జరుగుతుందని, విజయమాధవీ అధినేత చెప్పారు.

**రుద్రయ్యగా కృష్ణంరాజు**

అగ్రదర్శకుడు శ్రీ దాసరి ఫిబ్రవరి 15 నుంచి విజయమాధవీ పిక్చర్స్‌కు "కటకటాల రుద్రయ్య"ను చెయ్యడానికి కార్యక్రమాన్ని నిర్ణయించారు.

ఈ చిత్రంలో (కలర్) రుద్రయ్యగా కృష్ణంరాజుగారికి ప్రతిష్ఠాత్మకమైన పాత్ర లభించింది. ఆయన సరసన జయసుధ, మురళీమోహన్ సరసన జయచిత్ర నటించగలరని తెలిసింది.

శ్రీ వడ్డె శోభనాద్రి నిర్మిస్తున్న యీ వర్ణ చిత్రానికి జె. వి. రాఘవులు సంగీతాన్ని, కె. ఎస్. మణి ఛాయాగ్రహణాన్ని, భాస్కరరాజా శిల్పాన్ని, జి. జి. కృష్ణారావు కూర్పును నిర్వహిస్తున్నారు.

**పంపిణీదారుడుగా మారిన నిర్మాత**

"అంతా విధి లిఖితం. జరిగే ప్రతి సంఘటనకు, కర్తగా వుండేది ఆయనే. ఏం జరిగినా... ఎలా మారినా, దాని వెనక "చక్రధారి" ఆజ్ఞ వుంటుంది" అన్నారు పంపిణీదారుడుగా మారిన చిత్ర నిర్మాత శ్రీ జి. వి. ఎస్. రాజా.

శ్రీ రాజా చిత్తూరు జిల్లాలో నగరి సమీపాన వున్న సిద్ధరాజకండ్రిగలో పుట్టారు. నిర్మాణ శాఖలో సహాయకుడుగా సినీరంగాన్ని ప్రవేశించిన శ్రీ రాజా తన మంచితనంతో అందరినీ ఆకర్షించి, శ్రీయుతులు బి. ఎన్. రెడ్డి, నాగయ్య, నాగిరెడ్డి, ఏ. వి. ఎమ్. చెట్టియార్, భానుమతి, రామకృష్ణ, సుందర్‌లాల్ నహాతా, దేవర్ మున్నగు ప్రముఖుల ఆదరణ ఆశీర్వాదాలతో వేస్టు ఫిలిం వ్యాపారాన్ని విజయవంతంగా నిర్వహించారు. బాగా తెలిసిన వాళ్లు ఈయన్ను "బంగారు రాజా" అంటారు. పేరును తన ప్రవర్తన ద్వారా సార్థకం చేసుకున్నారీయన.

**నిర్మాత... పంపిణీదారుడు**

విజయలక్ష్మి మూవీస్ సంస్థను నెలకొలిపి, వరుసగా మూడు మంచి చిత్రాలను నిర్మించారు. [ఆడజన్మ... అమ్మ మాట... అమ్మ మనసు] తరువాత కొంత కాలానికి అదే పేరుతో రాయలసీమలో పంపిణీ సంస్థను స్థాపించి ప్రజాదరణ పొందిన పాత చిత్రాలను కొన్నారు. తిరుపతి... గుంతకల్‌లో ఆఫీసులు నడుపుతున్నారు.

ఇప్పుడున్న అయోమయ పరిస్థితిని నమ్మి కొత్త చిత్రాలను పంపిణీ చెయ్యడానికి శ్రీ రాజా సుముఖతను చూపడంలేదు. వస్తున్న ఎన్నో కొత్త చిత్రాలకన్నా, పాత చిత్రాలే బాగా వసూలిస్తున్నాయి, అన్నారు శ్రీ రాజా.

శ్రీ ఎన్టీఆర్ నటించిన కథానాయకుని కథ... ఎదురులేని మనిషి... సతీసావిత్రి, శ్రీ శోభన్ నటించిన మొనగాడు వీరి పంపిణీలో బాగా ప్రదర్శిత మవుతున్న నిజాన్ని శ్రీ రాజా తెలిపారు.

శ్రీ రాజా జపాన్ దేశాన్ని పర్యటించి వచ్చారు త్వరలో సిలోన్... సింగపూర్ దేశాలకు వెళ్లే వుద్దేశ్యం వుంది శ్రీ రాజాకు.

వచ్చే రెండు, మూడు మాసాలలో అగ్ర





నాయకునితో చిత్ర నిర్మాణం చేసే తలంపు తనకు వున్నట్టు శ్రీ రాజా వెల్లడించారు.

### స్వామి చిత్రానికి సాంబశివరావు

ప్రముఖ ఛాయాగ్రహణ దర్శకుడు శ్రీ వి. ఎస్. ఆర్. స్వామి ప్రారంభించిన కొత్త తరహా చిత్రానికి "అర్ధాంగి" ఫేమ్ పి. సాంబశివరావు దర్శకుడుగా పదవీస్వీకారం చేసి, ప్రసాద్‌లో మొదటి షెడ్యూలును పూర్తి చేశారు.

జయసుధ ముఖ్య నటిగా, చంద్రమోహన్ నాయకుడుగా, సత్యనారాయణ ముఖ్య నటుడుగా నటిస్తున్న స్వామిగారి చిత్రం ఫిబ్రవరికల్లా పూర్తి కాగలదని తెలుస్తోంది.

### 1977 లో విజేతలు !

జనవరి నుంచి డిశంబర్ వరకు 70 చిత్రాలు విడుదల అయ్యాయి. ప్రారంభపు నెలలో ఏడు చిత్రాలు, తరువాతి నెలలో అయిదు, మూడో నెలలో అయిదు, ఏప్రిల్‌లో 6, మే ... జూన్ మాసాలలో 12 చిత్రాలు తెరపై కనిపించాయి

జులై నుంచి డిశంబర్ వరకు మరో 35 చిత్రాలు వచ్చాయి. వీటిలో నిర్మాతలకు డబ్బును, ప్రేక్షకులకు తృప్తిని యిచ్చిన చిత్రాలు ఎన్నో తెలుసా ?

జనవరిలో "దాన వీర శూర కర్ణ", "సంసారంలో సరిగమలు, అత్తవారిల్లు" చిత్రాలు. ఫిబ్రవరిలో "చక్రధారి, సావాసగాళ్లు ... జడ్జిగారి కోడలు" చిత్రాలు. మార్చిలో ఒక్క "ఆలుమగలు" చిత్రం మాత్రమే విజయాన్ని చవిచూచింది.

ఏప్రిల్‌లో "అడవిరాముడు" అద్వితీయ విజయాన్ని, "బంగారుబొమ్మలు" షుమారు విజయాన్ని ఆర్జించిపెట్టాయి. "మే" మాసంలో "అందమే ఆనందం" మాత్రమే ప్రజలను ఆకర్షించగలిగింది.

జూన్‌లో సూర్యుడి ఆగ్రహంతో చిత్రాలు కూడా ప్రేక్షకుల అనుగ్రహానికి నోచుకోలేక పోయాయి.

జులైలో ఎదురీత ... ఆగస్టులో "ఇదెక్కడి న్యాయం, చిలకమ్మ చెప్పింది ... చాణక్య... చంద్రగుప్త" చిత్రాలు ధన విజయాన్ని సంపాదించాయి.

సెప్టెంబర్‌లో "అమరదీపం ... దొంగలకు దొంగ" చిత్రాలకు అమోఘ ప్రజాదరణ లభించింది.

అక్టోబర్‌లో "యమగోల" అసాధారణ విజయాన్ని, "చిల్లరకొట్టు చిట్టెమ్మ" అనూహ్య విజయాన్ని సాధించాయి.

నవంబర్‌లో "ఆత్మీయుడు" చిత్రానికి మాత్రమే పసూళ్ల విజయం లభించింది.

డిశంబర్‌లో విడుదలయిన "దేవతలారా దీవించండి" ప్రేక్షకుల దీవెనలతో దివ్యంగా ఆడుతూవుంది.

### రేసులో నెగ్గినవారు

1977 లో జరిగిన చిత్రాల రేసులో నెగ్గినవారు ఎవరని

దర్శకులలో శ్రీ నారాయణరావు, శ్రీ రాఘవేంద్రరావు, శ్రీ తాతినేని రామారావు, శ్రీ దాస్. నటులలో శ్రీ రామారావు, శ్రీ నాగేశ్వరరావు, శ్రీ కృష్ణ, శ్రీ కృష్ణంరాజు. హీరోయిన్లలో జయప్రద, జయచిత్ర, జయసుధ, ప్రభ. సంగీత దర్శకులలో మహదేవన్, చక్రవర్తి, రమేష్‌నాయుడు, సత్యం.

### 1978 లో తారాబలం !

1978 లో ఎవరికి ప్రజాదరణ అధికంగా లభించగలదో సూచనప్రాయంగా వ్రాయనా ?

శ్రీ ఎన్టీరామారావు ... కుమారి జయప్రద; శ్రీ అక్కినేని, శ్రీ కృష్ణ, శ్రీ కృష్ణంరాజు... జయసుధ. శ్రీ రాఘవేంద్రరావు, శ్రీ దాసరి నారాయణరావు, శ్రీ తాతినేని రామారావు.

నేను జ్యోతిశ్శాస్త్ర పండితుడనుకాను ... ఫలితాలను చెప్పడానికి. ప్రజల నాడిని తెలిసిన వాడినిగా ... కొంత చెప్పగలిగాను ... అంతే.

### అజయ్ ఆర్ట్స్‌లో అక్కినేని

విఖ్యాత నిశ్చల ఛాయాగ్రాహకుడు శ్రీ సత్యం (జైహింద్) అజయ్ ఆర్ట్స్‌ను నెలకొలిపి, శ్రీ అక్కినేని... శ్రీ తాతినేని రామారావులను నాయక... దర్శకులుగా ఎంపిక చేసిన విషయం పాఠకులకు తెలుసు.

డిశంబర్ 29న శ్రీ అక్కినేని, సత్యంగారికి ఫిబ్రవరి నుంచి పని చెయ్యడానికి వీలుగా కాల్‌షీట్లు యిచ్చినట్టు తెలిసింది.

శ్రీ అక్కినేని నటిస్తున్న వర్ణచిత్రానికి ఆచార్య ఆత్రేయ రచన్ను సమకూరుస్తున్నట్టు, భారీ తారాగణం ప్రధాన పాత్రలను పోషించనున్నట్టు, దర్శకుడు శ్రీ రామారావు తెలిపారు.

### డైరెక్టరుగా చక్రవర్తి

"లక్ష్మణరేఖ" చిత్రాన్ని నిర్మించిన చిత్తూరు శ్రీ షణ్ముగం ప్రారంభించిన "మరో సీత కథ" చిత్రంలో సంగీత దర్శకుడి పాత్రను... శ్రీ చక్రవర్తి పోషించడం గమనించదగ్గ విషయం.

శ్రీ ఎన్. గోపాలకృష్ణ దర్శక... కథకుడుగా పదవీ భారాన్ని నిర్వహిస్తున్న "మరో సీత కథ"లో టైటిల్‌కు వర్తించే పాత్రను కె. విజయ పోషిస్తున్నది.

"గాన గంధర్వుడు"గా మురళీ మోహన్, ఆతగాడి అర్ధాంగిగా ప్రభ నటిస్తున్న యీ చిత్రంలో మోహన్‌బాబు, మాడా వంటి పాపులర్ నటులు ముఖ్యత్వం వహిస్తున్నారు.



'దేవదాసు మళ్ళీపుట్టాడు'లో జానకి, వాణిశ్రీ

# సినిమా

## ఛత్రపతికి కృష్ణ దర్శకత్వం?

"సీతారామరాజు" పాత్రను ఎంతో సహజంగా పోషించిన "ప్రజానటుడు" కృష్ణగారికి మహారాష్ట్ర వీరుడి కథపై గురి ఏర్పడి చాలాకాలం అయ్యింది.

"ఛత్రపతి"కి వలసిన ఫేస్ యాప్ట్‌నెస్ కృష్ణగారికి వున్నది. ఒక చరిత్రకారుని పాత్రను పోషించి ... ప్రజలను మెప్పించగల ప్రజ్ఞ కృష్ణగారికి గలదని "సీతారామరాజు" చిత్రం నిరూపించింది.

ఈమధ్య ఒకరోజున కృష్ణగారిని "శివాజీ" చిత్ర నిర్మాణం గూర్చి అడిగాను.

"నవంబర్ ... డిశంబర్ మాసాలలో తలపెట్టాం," అన్నారు.

దర్శకత్వాన్ని ఆయనే నిర్వహిస్తారేమో!

## శివరంజనిగా కొత్త నాయిక

అగ్రదర్శకుడు శ్రీ దాసరి నిర్మించనున్న న్యూవేవ్ చిత్రం "శివరంజని"కి కొత్త నటిని ఎంపిక చెయ్యడానికి తీవ్రంగా అన్వేషిస్తున్నట్టు... నిర్మాతగా వ్యవహరిస్తున్న శ్రీ బసవయ్య తెలిపారు.

శ్రీ రమేష్ సంగీత సారధ్యంలో... శ్రీ దాసం గోపాలకృష్ణ అయిదారు పాటలకు గీతాలను సమకూర్చినట్టు, దర్శక శ్రేష్టుడు తెలిపారు.

"శివరంజని" చిత్రంలో నటించడానికి వొప్పందమయ్యే నటిని, శ్రీ దాసరి వరుసగా రూపొందించే చిత్రాలలో కూడా ప్రోత్సహించే నిర్ణయాన్ని తీసుకున్నారు.

"శివరంజని" పాత్ర ఎవర్ని వరిస్తుందో, మరి. ఆమె జాతకం శుక్రదశలో ప్రవేశించినట్టే.



తుఫాన్ నిధికోసం భిక్షాటన చేస్తున్న అగ్ర నటద్వయం —ఫొటో : మోహన్‌రావు

జనవరి ఒకటో తేదీన, కృష్ణగారు నటిస్తున్న రెండు సోషల్ చిత్రాల ముహూర్తాలు జరిగాయి.

ఒకటి : శ్రీకాంత్ ప్రొడక్షన్స్‌వారి "ఏజెంట్ – 116", శ్రీ కె. ఎస్. ఆర్. దాసు దర్శకుడు. జయప్రద నాయిక.

రెండు : సరోజినీ ఆర్ట్స్‌వారి "చెప్పింది చేస్తా" శ్రీ ఎమ్. ఎస్. గోపీనాథ్ దర్శకుడు. జయచిత్ర నాయిక.

"ప్రతి నెలా ఒక చిత్రం ప్రారంభం... ప్రతి నెలా ఒక చిత్రం విడుదల" అన్నారు కృష్ణ

ఆగస్టు వరకు తన నిర్మాతలకు కృష్ణగారు కాల్‌షీట్లు యివ్వడం మూలంగా... ఆయన నటించాల్సిన కొన్ని చిత్రాలు మరొకరికి వెళ్ళాయి.

## పద్మావతిగా జయప్రద

వెంకటేశ్వరస్వామిగా "నటరత్న" శ్రీ ఎన్టీఆర్ నటించనున్న పౌరాణిక వర్ణచిత్రంలో పద్మావతిగా జయప్రద నటించగలదని విశ్వసనీయంగా తెలిసింది.

"అడవిరాముడు... యమగోల" వంటి మాస్ అప్పీలు చిత్రాలలో తన గ్లామరుతో ప్రేక్షకులను సమ్మోహితుల్ని చేసిన జయప్రద పవిత్రమైన పాత్రలకు సంపూర్ణ న్యాయం చెయ్యగలదని, శ్రీ ఎన్టీఆర్ పద్మావతి ద్వారా నిరూపించబోతున్నారు.

"సీత"గా ఎంతో ముగ్ధత్వాన్ని ప్రదర్శించిన జయప్రదకు పద్మావతి పాత్ర రావడం... ఆమెను "ఆల్ రవుండర్" అనిపిస్తుంది.



న్యూఢిల్లీలోని ఎన్.ఎం.డి.సి.కమ్యూనిటీసెంటర్‌లో ఆ స్కూలులో చదువుతున్న బాలిక శ్రీమతి కార్టర్ నుదుట తిలకాన్ని దిద్దుతున్న దృశ్యం.

## తమిళం నుంచి తెలుగు కొచ్చిన మరో మంచి నిర్మాత

తమిళంలో దేవర్ పేరు తెలియనివారుండరు. ఆయన సుబ్రమణ్యస్వామి భక్తుడు. ఎన్నో గుడులను... గోపురాలను ఆ దేవుడికి కట్టించారు.

శ్రీ దేవర్ నిర్మించిన చిత్రాలలో జంతు ప్రాబల్యం ఎక్కువగా వుంది. వాటిచేత అమాహ్యమైన పనులను చేయించి, ప్రేక్షకులను మంత్ర ముగ్ధుల్ని చేసి బాగా డబ్బు గడించారు.

తమిళ... హిందీ రంగాలలో ప్రతిష్ఠ నార్జించిన శ్రీ దేవర్ యిప్పుడు తెలుగు రంగాన్ని ప్రవేశించారు.

తమిళంలో శ్రీప్రియ... "రాము" అనే మేక ముఖ్య పాత్రలను పోషించిన "ఆట్టుకార అలమేలు" చిత్రాన్ని, తెలుగులో శ్రీ త్రివిక్రమరావు (విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్) సహవాసంతో నిర్మించడానికి నిర్ణయించారు.

"జనవరి... ఫిబ్రవరి" మాసాలలో షూటింగును పూర్తిచేసి, మార్చిలో చిత్రాన్ని విడుదల చెయ్యడానికి అనుకూలపడే నటీనటులను ఎంపిక చెయ్యనున్నట్లు తెలిసింది.

—శ్రీనివాస్ ★



'పట్నవాసం'లో శ్రీప్రియ బృందం 

## జయసుధ మూడు పాత్రలు

కృషితో తారాపథంలో అగ్రశ్రేణిని చేరుకున్న జయసుధకు 1978 మరింత పుత్సాహభరితంగా వుంటుంది.

1977లో, జయసుధ నటించిన "ప్రేమలేఖలు... అర్ధాంగి... ఆమె కథ" చిత్రాలు ప్రేక్షకుల్లో ఆమెపట్ల వుత్తమ అభిప్రాయాన్ని ఏర్పరచింది.

కొత్త సంవత్సరంలో జయసుధ మరో మెట్టు అధిరోహించే అవకాశాన్ని, దర్శకుడు చంద్రశేఖర రెడ్డి కలుగచేశారు.

భాగ్యనగర్ స్టుడియో నిర్మించనున్న కలర్ చిత్రంలో జయసుధకు మూడు పాత్రలు పోషించే అవకాశం రావడం... ఆమె భవిష్యత్తుకు బలాన్ని చేకూర్చేది తథ్యము అని భావించబడుతూంది.

'సీతామాలక్ష్మి'లో రామేశ్వరి, పల్లవి 



రాజబాబు దంపతులతో జి. వి. యస్. దంపతులు



ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. -సం.

# బైస్కోపు బాతాఖానీ

[వీరాజీ]

"మరో చరిత్ర" అంతా విశాఖపట్నంలోనే జరుగుతూంది — అక్కడ సముద్రం ఒడ్డున ఒక పెద్ద యిల్లు — చిన్న యిల్లు వుంటే — పెద్దింట్లో — ఆంధ్రాలో సెటిల్ అయిన అరవ్వాళ్లబ్బాయ్ — చిన్న యింట్లో — తెనుగు వాళ్లమ్మాయ్ వుండి ప్రేమించుకుంటారీ అరంగణ్ణల్ ప్రొడక్షన్‌లో!

'సరితా' అనే అమ్మాయిని స్కూల్లోనుంచి నేరుగా తెరమీదకు తీసుకొస్తున్న దర్శకుడు బాలచందర్ ''యీ పిల్ల పెద్ద స్టార్ ఐపోతుందన్న ఆశ'' పెట్టుకున్నాడు — బాలచందర్‌గారికి దక్షిణాది డైరెక్టర్‌లలో మొదటిశ్రేణి చోటుంది. అవార్డులు తెచ్చుకునే సినిమాలు తీసే ''బాలచందర్ స్కూలు''ని మన యువ దర్శకులు కొంతమంది అనుసరిస్తున్నారు కూడా — అంచేత యీ 'అమ్మాయి' సరిత మీద మనం కూడా హోప్ పెట్టుకోవచ్చును... సరిత అసలు పేరు కాదు అనుకుంటాను — బాలచందర్ అంతులేని కథలో హీరోయిన్ పేరు కాబోలు అది — ఈ 'సరిత' స్టార్ అయితే యీ అమ్మాయిని బాలచందర్‌కి పరిచయం చేసినట్లు చెప్పబడుతున్న చక్రవర్తి గారికి కూడా క్రెడిట్‌లో కొంత దక్కుతుంది —

స్కూళ్లనుంచి వెండితెరకి...



బాలచందర్‌గారు ''తెనుగు మీరు మాట్లాడితే నేను అర్థం చేసుకోగలనేగాని యింకా మాట్లాడ లేకపోతున్నాను'' అన్నాడు — అతనికి విపరీతమైన అభిమానం గౌరవంవున్న డైరెక్టర్ వి. శాంతారామ్ గారని మాటల మధ్య చెప్పాడు... తెనుగువాళ్ళ అరవవాళ్ళ వీళ్లమధ్య సంప్రదాయాలు సెంటిమెంట్‌లు ఒక్కలాగే వున్నాయి కనుక నాకు తెనుగు హృదయాన్ని తెరమీదకి దింపడానికి — విశాఖ పట్నంలో సినిమా షూటింగు తియ్యడానికి కష్టంగా లేదు అన్నాడీ ''అపూర్వ రాగంగళ్'' దర్శకుడు...

## లోకనాథ్

''చిలకమ్మ చెప్పింది''ని నలుపు తెలుపులతో సహజాతి సహజంగా తెరకెక్కించిన లోకనాథన్ యీ సినిమాకి ''కామిరా'' హాండిల్ చేస్తూంటే చూశాను... గొప్ప ఆనందంగా వుంది. అతను తెనుగువాడేనుట! నేషనల్ అవార్డు తీసుకున్న వాడిలాగ తల ఎగరవేయడం రానేరాదు లోకనాథ్‌కి! 'మితభాషి' చిరునవ్వు మొహాన వెలిగించుకుని — విశాఖ బీచ్ చల్లని ఎండలో — సరిత మీద కొన్ని ''షాట్''లు తీస్తూంటే చూశాను.

సరిత — సముద్రపు టొడ్డున కూర్చొని — పేపర్‌లోకి చూసి తన ప్రియునికి సంబంధించిన వార్త చూసి షాక్ తిని — అంతలో కన్నీరు కార్చేసే సన్నివేశాన్ని చాలా శ్రమకి వోర్చి — కొత్తపిల్ల కదా! మూడుసార్లు ''జూమ్ జూమ్'' అని మరీ 'కట్' చేసి బాలచందర్ ఎఫెక్ట్ కోసం శ్రమపడుతూండగా... అసిస్టెంట్స్ ఆ ''పేపర్'' మీది 'తారీఖు' ప్రేక్షకుల కంటబడితే 'మరో చరిత్ర' ఐపోతుంది అంతాకూడా ''డేట్'' తప్పు అంటూ రన్న ఆందోళన వ్యక్తం చేయడంతో మళ్లీ — కథ మొదటి కొచ్చింది! ఇదలా వదిలేద్దాం — సినిమా షూట్ చెయ్యడంకన్నా నల్లపూసలు కళ్ళు మూసుకుని గుచ్చడం తేలిక అనిపిస్తుంది నాకు — షూటింగ్‌లు చూస్తూంటే...

ఆ పొద్దు అక్కడ షూటింగ్ చూడటానికి కొంచెమంది జాలర్లు మాత్రం చేరారు — పోలీసులు — రద్దీ లేదు — రోడ్డు కవతల చిన్న కాంపౌండులో పిల్లకాయలు యీ పూసే పట్టనట్లు క్రికెట్ ఆడుకుంటున్నారు కాని ఇదే విశాఖపట్నం పూళ్లోనైతే సినిమా షూటింగ్ చాలా కష్టంట! బాలచందర్‌గారు విశాఖపట్నం పెద్దోళ్లు సభలో చెప్పాడు — తెగ విరగబడి చూస్తారుట — విశాఖ వాళ్ళ షూటింగ్‌లు!?

'మరో చరిత్ర'కి విశాఖ నుంచి విజయనగరం దాకా కొన్ని అందమైనచోట్ల షూటింగ్ పూర్తి చేసుకున్న బాలచందర్ — యీ వూరికి సినిమా తెరమీద గిరాకీ పెంచుతున్నట్లే కనపడుతున్నది... ఏమైనా సరే, సినిమా తియ్యకపోయినా విశాఖపట్నం మారిపోయింది... గొంగళీపురుగు సీతాకోకచిలుకైనట్లుంది — పదేళ్ల క్రితానికి యిప్పటికీ!



నూతననటి 'సరిత'ను తీర్చిదిద్దుతున్న డైరెక్టర్ బాలచందర్: ''మరోచరిత్ర''

## వర్థమానతార మాధవి

మరో స్కూలు స్టూడెంటు మాధవి తెరమీదకి వస్తూనే తెనుగులో పెద్ద పెద్ద డైరెక్టర్ లనుకున్నవాళ్లందరి దగ్గరా పనిచేసింది. ఈ ''మరో చరిత్ర''లో ''యంగ్‌విడో'' వేషం వేస్తూంది — అయితే గిరీశం దగ్గర పాఠాలు వినే బుచ్చమ్మ వేషం కాదు — గిరీశానికి డ్యాన్సు నేర్పే వేషం — కాళ్లకి గల్లు గల్లుమనే పాంజేబులు పెట్టుకుని — మొఖాన పెద్ద బొట్టు దానిక్రింద చిన్న బొట్టు పెట్టుకుని విశాఖపట్నంలో కొత్తగా సర్దాపడి కొనుక్కున్న గడియారం పెట్టుకుని (డాడీ కొన్నారు వైజాగ్‌లో) — ''నాకు బోలెడు ఉత్తరాలు వస్తున్నాయి. అందులో విమర్శించే ఉత్తరాల్ని రెండుసార్లు చదువుతాను... యిదుగో యిక్కడికి కూడా కొన్ని తెచ్చుకున్నాను'' అంటూ గలాగలా మాట్లాడేస్తూ యింకా 'కాంప్లెక్స్' ఏమీ లేకుండా అడిగినవాటికి జవాబులు చెప్పే యీ వర్ధమాన తార — అప్పటి కృష్ణకుమారి లాగే యిండస్ట్రీలో ''టాల్‌గాల్''గా [నా హైట్ 5' 5" భలేవారే పొట్టిగా ఎలా కనపడతామా?] తారాపథంలో వేగంగా పైకి రాగలదనిపించింది!

దాసరి; బాపు; బాలచందర్; రాఘవేందర్‌ల వంటి కళాకారుల దర్శకత్వంలో యీ అమ్మాయి చాలా నేర్చుకుంది... యింకా అద్దంముందు అభినయం ప్రాక్టీస్ చేస్తూ — సినిమా చూసి తన తప్పులన్నీ 'నోట్' చేసుకుని అవి తిరిగి చెయ్యకుండా — జాగర్తపడుతూ ముందుకు పోవాలనుకునే యీ టీనేజ్ స్టార్‌కి జయబాధురీ, సంజీవకుమార్ అంటే చాలా యిష్టం — సెంటిమెంట్స్ ఏమీ లేవుకాని ''ఏదైనా పని పూర్తి అయితేకాని

చెప్పడం అలవాటు లేదు" – "గాడ్ అంటే కొంచెం భక్తి నమ్మకం"– అమితాబ్ బచన్ ప్రక్కన బహుశా "ఛాన్స్" సఫలమైతే హిందీలో కూడా నటించబోతున్నది. ఐనా "యిప్పుడే చెప్పనంది!" వేపచెట్టు మీద దెయ్యాలుంటాయన్న అనుమానం వున్న మాధవి యింతవరకు సినిమా రంగంలో ఎటువంటి "పాలిటిక్స్" బెడద

## బైస్కోపు బాతాఖానీ

లేకుండానే ఓ అరడజన్ సినిమాల్లో రకరకాల పాత్రలను పోషిస్తున్నది! వాటిల్లో ఎన్. టి. ఆర్. డైరెక్షన్ వున్న సలీం ప్రియురాలైన 'దిల్ రుబా' వేషం కూడా ఒకటి! అయితే ఎందుకనో "శైలా" వేషం వెయ్యాలంటే మహా సర్దా...అయితే యింకా "లవ్"లో పడలేదు పెళ్లి విషయంలోనూ పడలేదు [మమ్మీ డాడీలు కూడా యింకా అలాంటిదేమీ ఆలోచించటంలేదు... 'చిన్నపిల్ల. పైగా యిప్పుడు "కెరీర్" మీద కాన్‌సెంట్రేట్ చేస్తోంది'] 'ప్రభ', 'ప్రదా', 'సుధా'ల సరసన మాధవి వాలుగో వర్తమాన తారగా ప్రకాశిస్తుందింకమీదట అని నాకు అనిపిస్తోంది. ★



అమెరికా అధ్యక్షులు జిమ్మీకార్టర్ భారతదేశంలో జనవరి మొదటి మూడు రోజులు విజయవంతంగా పర్యటన చేశారు. వీరికి ఢిల్లీ విమానాశ్రయంలో ఘనస్వాగతం యిస్తున్న రాష్ట్రపతి నీలం సంజీవ రెడ్డి దంపతులు—ప్రధాని మొరార్జీభాయి దేశాయ్

## రాగమాలిక

[24 వ పేజీ తరువాయి]

నా స్వభావంలోని విచిత్ర మేమిటంటే — ఎవరన్నా వస్తే వాళ్ళెదుట రాధని చాలా గౌరవంగా, అభిమానంగా — ఎంతో ప్రేమ వున్నట్లు — ముట్టుకుంటేనే కందిపోతుందేమో నన్నట్లు చూసేవాణ్ణి. కానీ అది నటన మాత్రం కాదు. అప్పుడు నాలోని మానవుడు తొంగిచూసే వాడన్నమాట.

అందర్నూ నన్నొక ఆదర్శ పురుషుడి కింద అంచనా కట్టేవాళ్ళు.

నా మిత్రులు నన్ను అభినందిస్తుంటే నా మనసు ముల్లు గుచ్చుకున్నట్లు బాధపడేది.

నేను రాధ నిట్లా చిత్రహింస పెడుతున్నట్లు మా అమ్మకి గూడా తెలీదు.

రాధ ఎవ్వరితోనూ చెప్పేదికాదు. నేనన్నవన్నీ భరించేది. ఆమె భరించినకొద్దీ నేను బాధించే వాణ్ణి. ఆమె ఏడుస్తుంటే చూడలేకపోయేవాణ్ణి— నవ్వుతున్నా కోపం వచ్చేది. మంచున్నా — కూచున్నా — ఏ పని చేసినా సహించలేకపోయేవాణ్ణి.

రాను రాను నాకు మనశ్శాంతి లేకుండా పోయింది. ఆ ఇంటికీ — రాధకీ దూరంగా పారిపోదా మనిపించేది. రాత్రిళ్ళు గూడా రాధని దగ్గిరికి తియ్యడం మానేశాను. మా గదులు కూడా వేరయ్యాయి. నేను ఏమాశించి ఈ పెళ్ళి చేసు కున్నాను ? ఏం పొందాను ? రాధని ఏం సుఖ పెట్టాను ?

గతాన్ని మర్చిపోలేను.

రాధ అవివాహిత కాదు — అంతకుముందు. నేను పెళ్ళి చేసుకున్నది మరొకరి భార్యని. ఆ 'మరొకరు' బతికేవున్నారు.

ఆమె మనసు ఒకసారైనా అతడిమీద వాలకుండా వుంటుందా ?

ఇరవైనాలుగ్గంటలూ ఈ అనుమానం నన్ను వదిలేదికాదు. పిచ్చిపట్టినట్లుగా వుండేది.

కసి — కోపం పెరిగిపోయాయి నాలో. అప్పుడే తాగుడు మొదలుపెట్టాను.

తాగితే మండుతున్న గుండె చల్లబడ్డ ట్లుండేది.

ఆవిధంగా ఐదారు నెలలు గడిచాయి.

ఈ ఐదారు నెలలూ రాధ, నేనూ గూడా చిక్కిశల్యాలమయ్యాం.

ఆ సమయంలోనే నేను ఎప్పట్నించో ప్రయత్నిస్తున్న అమెరికా ఛాన్సు వచ్చింది మా ఆఫీసువాళ్ళే నన్ను పంపించడానికి నిశ్చయించారు.

కొన్నిరోజులు రాధకి దూరంగావుంటే నేను రాధ గతం మర్చిపోవచ్చునేమో అనుకున్నాను.

నెల తిరక్కుండానే అన్ని ఏర్పాట్లూ చేసుకుని అమెరికా వెళ్ళిపోయాను.

అక్కడ కావాంసే మూడేళ్ళున్నాను. అమెరికాలో నాకు అన్నీ వచ్చాయి. రకరకాల డ్రింక్స్ తాగేవాణ్ణి. ఎంతమందితోనో స్నేహం చేశాను. చాలామంది ఆడవాళ్ళు నాకు దగ్గిరగా వచ్చారు. పార్టీలకు వెళ్ళేవాణ్ణి. ఎంతోమందితో సంబంధం ఏర్పరుచుకుందామనుకున్నాను. వాటికి ఆ దేశంలో తప్పలేదు. కానీ, ఏ ఒక్క స్త్రీతోనూ సంబంధం పెంచుకోలేకపోయాను.

కారణం రాధ !

నాకు అక్కడకూడా ప్రతిక్షణం రాధే గుర్తుకొచ్చేది. నేను ఏ స్త్రీని చూసినా నాకా కోరిక కలిగేదికాదు. రాధ సాహచర్యంలో వున్న మాధుర్యం మరెక్కడా లేదని తెలుసుకున్నాను.

మంచున్నా కూచున్నా నిద్రలోనూ మెలకువలోనూ రాధే గుర్తుకొచ్చేది.

చిత్రమేమిటంటే అమెరికాలో వున్నంతకాలం నాకు రాధ మీద ప్రేమ అధికమయిందేకానీ ఆమె మీద వ్యతిరేక భావమే వచ్చేదికాదు. ఆమె గతం అసలు గుర్తేరాలేదు.

నాది చాలా పెక్యూలియర్ సైకాలజీ కదూ నుంజా ? రాధ మీదే ప్రాణం పెట్టుకుని అహర్నిశలూ రాధనే తల్చుకుంటూ ఊహల్లో కలల్లో ఆమెనే చూస్తూ ఆమెతో సుఖిస్తూ పయ్యాటలాడుతూ చిలిపితగాదాలు పెట్టుకుంటూ మూడేళ్ళూగడిపాను. వారానికోఉత్తరం తప్పకుండ రాసేవాణ్ణి, ఎంతో ప్రేమగా. నా కలలూ, కోరికలూ ఏకరువుపెడుతూ రాసేవాణ్ణి.

రాధ నా ఉత్తరాలు చదువుకుంటూ పరవశించిపోయేది ఇక్కడ.

నేను మారానని చాలా సంతోషించింది. ఆమె సంతోషం అంతా ఆమె ఉత్తరాలే నాకు తెల్పేవి.

నేను అమెరికాలో వుండగానే రాధ తండ్రి పోయినట్లు తెలిసింది. రాధని ఊరడిస్తూ పుత్తరం రాశాను.

ఆ తరవాత నెలకే నేను తిరిగొచ్చాను. అదనపు డిగ్రీలతో — పెరిగిన హోదాతో సగర్వంగా తిరిగివచ్చాను వస్తూ వస్తూ రాధని ప్రేమించడమే గాని ద్వేషించకూడదని దృఢ నిర్ణయం చేసుకున్నాను

[ఇంకా ఉంది]



కె. ఎన్. బిహెచ్. — పిఠాపురం

కె. రామలక్ష్మిది విచిత్రమైన ప్రకృతి. ఎవరిని ప్రేమిస్తుందో ఎవరిని ద్వేషిస్తుందో తనకే తెలియదు. అయినా తనంటే ఎందుకో నాకు ఆకర్షణ.' అని లతగారు తమ అంతరంగ చిత్రంలో వ్రాసుకొన్నారు. మీ కామెంట్ ?

★ లత ఊహాగానం చేస్తుందని తెలిసీ కామెంట్ అడుగుతావేం సోదరీ, ప్రేమా ద్వేషం నాణేని కిరుపక్కలు. అందుకే ద్వేషించిన వ్యక్తిని కూడా ప్రేమించకల్గుతాం. ఈ విషయం లతకి తెలియకకాదు ! నాకూ లత అంటే యిష్టమే — 'ఏం రాసినా చదివించే' రచనానైపుణి కల రచయిత్రి లత.

జి. ఆర్. ఎల్. — కాకినాడ

నేనొక అమ్మాయిని ప్రేమించాను. ఆమె వేరొకరిచేత మోసగింపబడి తల్లియై పిల్లను కని పోషించుకుంటూంది. నేనామెను పెండ్లి చేసుకోవాలనుకున్నాను. కాని భర్తగా ఆమెను సుఖపెట్టకలనుగాని ... తల్లి పిల్లలను వేరు చేస్తానేమోనని ఆమె భయపడుతోంది.

★ మీ డొంకతిరుగుడు అనుమానాలకి నాకే అనుమానంగా వుందే — ధైర్యంచేసి పెళ్లి చేసుకోవాలంటే ఆ తల్లికి వుండదా అనుమానం? ! ఈ దేశంలో పతితని పెళ్లి చేసుకుని ఉద్ధరిస్తామనే వాళ్ల తత్వాలు చాలా గమ్మత్తుగా వుంటాయి.

# ప్రశ్నావళి

-కె. రామలక్ష్మి

'నేను కనుక నిన్ను పెళ్లాడాను. ఉద్ధరించాను' అంటూ జీవితాంతం కాల్చుకుతిన్న సంఘటనలు నాకు తెలుసు ! అందుకే ఆడవాళ్ళ ఈ ఉద్ధరణ అనేసరికి భయపడేది ... తమ జీవితాలు 'పెనం మీద నుంచి పొయిలోకి పడ్డట్టు' అయిపోతాయని అనుమానించడంలో అందుకే ఆశ్చర్యంలేదంటాను.

జామున — మద్రాసు

మీదగ్గిర మాటకారితనం అహంకారం నేర్చుకోవలెనని వుంది ఏం చేయమంటారు ?

★ వీటి నెవరూ ఎవరికీ నేర్పించలేరు. స్వతహాగానో వారసత్వంగానో రావాలంతే ! నాది మా మేనత్త పోలిక ! ఆవిడగారు యింట్లో వుందంటే — పక్కింట్లోకూడా మొగుడుపెళ్లాలు దెబ్బలాడుకునేవారు కాదంట ! !

వి కె. ఆర్. — సికింద్రాబాదు

మూలిగే నక్కమీద తాటికాయ పడ్డట్టు... కష్టాలు...

★ చూడండి మూలగడం తగ్గిస్తే రోగం తేలికైనట్టు వుంటుందని నమ్మేరకం నేను ! కష్టాలు తప్పనప్పుడు తప్పించుకోలేనప్పుడు విసుక్కుని సణుక్కుని ప్రయోజనం ఏమిటి ? వరసెట్టి ఓ పక్కనుంచి వాటిని నరుక్కొచ్చే ప్రయత్నాలు చేయాలిగాని.

ఎస్. ఎల్ — ఏలూరు

కె. రా గారూ మీరు స్త్రీలపట్ల చూపిస్తున్న ప్రోత్సాహం అంటే నాకు చాలా ఉత్సాహం వేస్తుంది...

★ థాంక్యూ ! ఆడదాన్ని ఆడది అర్థం చేసుకోవడం, ఆదరించడం ఆదుకోవడంతో ప్రారంభించితే - పురోగమనం - మన వెంటపడి అదే వస్తుంది.

ఎమ్. ఆర్. ఆర్. — ధన్‌బాద్

తెలుగు భాషతో పూర్తిగా సంబంధం మానేస్తే మీ ఆరోగ్యం పూర్తిగా నయం అవుతుందని భావిస్తాను. (చూ. 29–7–77 పత్రిక.)

★ మీది మరీ ప్రవాసాంధ్ర మనస్తత్వం ! వీరశైవంలాగా చాలా దూకుడుగా వుంటుంది ! తెలుగుగడ్డకి దూరంగా వుంటేనే యిలా తెలుగోయమ్మ తెలుగని నెత్తికెత్తుకునేది. అదే రాష్ట్రంలో వుండండి — మీరే పేటకో తెలుగు దర్బార్లు తయారుచేసి — ఎవరికివారే సింహాసనాలు చూసుకుంటారు !




జగన్నాయకులుకి, ఆయన భార్యకి పిల్ల నచ్చింది. బేంక్‌లో ఆఫీసర్‌గా పని చేస్తున్న ఆయన కొడుకుని విశాఖపట్నం నుంచి పిలిపించి పిల్లని చూపించారు. అతనికి పిల్ల నచ్చింది. మళ్ళీ వైజాగ్ వెళ్ళి పోయాడు.

సాంప్రదాయమైన కుటుంబం. అన్ని విధాలా తగిన సంబంధం అని మురిసి పోయారు ముసలివాళ్ళిద్దరూ. ఓ రోజు పిల్లతండ్రి వచ్చాడు జగన్నాయకులు ఇంటికి.

"అబ్బాయి ఏమన్నాడు ?" అడిగాడు కుశల ప్రశ్నలు అయాక.

"నచ్చింది. నిశ్చితార్థం గురించి ఆలోచిస్తున్నాం ?" చెప్పాడు జగన్నాయకులు కాబోయే వియ్యంకుడితో.

ఇన్‌కంటాక్స్ ఆఫీసర్‌గాచేసి, ఇంకా రెండేళ్లలో రిటైరవబోతున్న ఆయన చెప్పుకొచ్చాడు.

"నాకు నలుగురు ఆడపిల్లలు, ఇది మూడవది. ఇంకా ఒకమ్మాయి పెళ్ళికుంది. మీకు మీ స్థోమతకు తగ్గట్టుగా అన్నీ చేస్తాను. ఎలాంటి లోపం రానివ్వను. ఇరవై వేలుకి మించి ఇవ్వటం నా వల్లకాదు అమ్మాయిపేర నాలుగేళ్ళక్రితం ఇరవై సంవత్సరాలకి పదివేలు ఫిక్స్‌డ్ డిపాజిట్‌లో వేసాను రేడియో, టేప్‌రికార్డర్, సోఫా, గ్రాడేజ్ బీరువా, పరుపులులాంటివి పది వేలరూపాయల విలువచేసేవి ఇస్తాను. తల్లి బంగారం పదిహేనువేల రూపాయల విలువుంటుంది..."

అన్నిటికీ తలూపారు దంపతులిద్దరూ తర్వాత వుత్తరం రాస్తామని చెప్పారు.

"ఎంత పెద్ద సంబంధం ఓ పదివేలిస్తే ఏంటారేమో ననుకున్నాను" అన్నది ఆవిడ భర్తతో, ఎంతో సంబరంగా.

"మనకొద్దీ సంబంధం" అన్నాడాయన ఆలోచనగా.

"ఏం ? ఇంకా మంచి సంబంధం వస్తుందనా ?"

"కాదే పిచ్చిదానా. ఆయన చెప్పినదాన్ని బట్టి దాదాపు ఏభైవేల రూపాయలు ఏ రూపంలోనైతేనేం ముడతాయి. బేంక్‌లో ఆఫీసర్‌గా చేసే మనవాడికి అంత కట్నం నటనా ? ఎంతమాత్రం కాదు. ఆ కట్నానికి కలెక్టర్‌ని తేవచ్చు నిజానికి. అయినా మన సంబంధం కోసం ప్రాకులాడుతున్నాడంటే నాకేదో అనుమానంగా వుంది."

"అంటే ?"

"ఆ అమ్మాయిలో ఏదో లోపం వుండి వుండకపోతే, వెనకాల ఆస్థయినాలేని మన వాడికి అంత కట్నమా ? కాలేజీలో నాలు గేళ్ళు చదివిందాయె ఏం ముదనష్టపు సంబంధమో? పదివేలు ఇచ్చుకునే శక్తిగల మామూలు సంబంధం చాలు మనకి"

ఇన్‌కంటేక్స్ డిపార్టుమెంట్‌లో అనేక విధాలుగా డబ్బు సంపాదించిన ఆ పిల్ల తండ్రి తను సంపాదించింది తన కూతుళ్ల కోసమే అనే దృష్టితో, పిన్నియర్‌గా కాబోయే వియ్యంకుడికి తను ఇద్దామను కున్నది గొప్పగా, గర్వంగా చెప్పాడు.

ఆయననుంచి తాంబూలాలు పుచ్చు కునేందుకు ఫలానా రోజు వస్తున్నామనే ఉత్తరం కోసం ఎదురు చూడసాగాడు.

జాతకాలు కలవలేదు కాబట్టి తమ సంబంధం సంగతి మర్చిపొమ్మని జగన్నాయకులు వ్రాసిన వుత్తరం అందిందా యనకి.

"అదృష్టం లేదు వాళ్ళకి. బేంక్‌లో ఆఫీసర్‌కి అంత నగదు ఎవరిస్తారు ఈ రోజుల్లో?" అన్నాడాయన తన కూతురితో చిన్నగా నిట్టూర్చి.



# మాయాజాలం మతికట్టు

ఇలాంటి వాళ్ళ ప్రదర్శన విషయంలో ఫలానా సందర్భంలో ఇంద్రజాల ప్రదర్శన ఇవ్వవలసిన పరిస్థితి రావచ్చని ముందుగానే ఊహించి వచ్చుడూ, ఆ సందర్భాను సారంగా ప్రదర్శనకి సిద్ధంగా వుండడం కూడా ఎంతైనా అవసరం.

ఆ రోజు ఫిబ్రవరి 29 వ తేదీ. సాయంత్రం 4 గంటలయింది. ఫోన్ గణ గణ మోగింది. రిసీవర్ అందుకుని 'హల్లో కామేష్ హియర్' అన్నాను.

నా అప్త మిత్రుడు సుశీల్‌రావు ఫోన్ చేశాడు.

ఆ రోజు తన పుట్టినరోజు పండుగనీ, నన్ను మరీ మరీ రావలసినదనీ. బంధు మిత్రు లందర్నీ పిలిచినట్లుగానూ, నేనే అందరి సమక్షంలో బర్త్‌డే కేక్ కట్‌చేసి పెట్టాలని కోరాడు. తర్వాత, నేను పార్టీకి వస్తున్నట్లుగా తన మిత్రులందరికీ చెప్పి వటు గాన్ను, చెబుతూ, నా గురించి ఎదురు చూస్తూంటావని అన్నాడు.

సుశీల్‌రావు బాగా సంపన్న కుటుంబంలో పుట్టినవాడు. వారి తల్లిదండ్రులకు ఒక్కగానొక్క సంతానం. తరాల వరకు తరగనంత ఆస్తి. ఏడాదికి ఒక దఫా పుట్టినరోజు పండుగను గ్రాండ్ స్కేల్‌లో చెయ్యగల సమర్థుడు.

కానీ ఏం లాభం! అదేం వింతోగాని వాడు ఫిబ్రవరి 29 వ తేదీన పుట్టాడు. అంటే మళ్ళీ నాలుగేళ్లదాకా పాపం! వాడి పుట్టినరోజు రాదన్నమాట.

## "అ బ క డ బ"

అట్లాంటి ఆప్తమిత్రుడు అంతగా రమ్మని కోరినప్పుడు వెళ్ళకపోతే బాగోదు కనుక, మళ్ళీ నాలుగు సంవత్సరాలవరకు వాడి పుట్టినరోజు రాదు కనుక. సరే, తప్పకుండా వస్తానని మాటిచ్చి, ఫోన్ పెట్టేశాను.

సాయంత్రం 6 గంటలయింది. సుశీల్ రావు భవంతి, రంగు రంగుల లైట్ల కాంతుల మధ్య, బంధువులతోనూ స్నేహితులతోనూ, ఇతర శ్రేయోభిలాషులతోనూ, పెళ్లి వారిల్లులా ఎంతో శోభాయమానంగా వుంది.

సుశీల్‌రావు నన్ను రిసీవ్ చేసుకుని, అందరికీ పరిచయం చెయ్యడం మొదలు పెట్టాడు. ఫంక్షన్‌కి వచ్చినవాళ్లందరూ ఒకరి కొకరు విష్ చేసుకుంటూ షేక్ హేండ్లమయం చేస్తున్నారు.

ఫంక్షన్ అంతా బ్రహ్మాండమైన సెంటర్ హాలులో ఏర్పాటు చేశారు. హాలు మధ్యలో ఒక రౌండ్ టేబిల్, టేబిల్‌ని పూర్తిగా కప్పివుంచేలా దానిపై ఖరీదైన ఒక వెల్వెట్ క్లాత్, మధ్యలో ఆకర్షణీయమైన డిజైన్లతో తయారుచేసిన పెద్ద బర్త్‌డే కేక్, దానిచుట్టూ క్రమ పద్ధతిలో క్రొవ్వొత్తులూ అందంగా వున్నాయి.

సరిగ్గా 6 30 గంటలయింది. నాతో బాటు మిత్రులంతా సుశీల్‌రావుని టేబిల్ దగ్గరకి తీసుకువచ్చి, టేబిల్ చుట్టూ చేరాము.

ఈలోగా సుశీల్‌రావు బామ్మగారు, పెద్ద యిత్తడి పళ్లెంతో ప్రత్యక్షమై,




హారతిస్తూ కర్ణకఠోరమైన మంగళహారతి పాడి (వాళ్ళ ఆచారం, మనమేం చేస్తాం) తప్పకుంది.

తర్వాత సుశీల్‌రావు అందరిని వుద్దేశించి "మిత్రులారా! నా చిన్ననాటి స్నేహితుడైన మెజీషియన్ కామేష్‌ని ఫంక్షన్ ప్రారంభించమని కోరుతున్నాను" అన్నాడు.

హేపీ బర్త్‌డే టూ యూ అంటూ, ఒక క్రొవ్వొత్తితో కేక్ చుట్టూ వున్న క్రొవ్వొత్తులన్నీ వెలిగించి, సుశీల్‌రావు చేత కేక్ కట్ చేయించి, ఒక ముక్క తన నోట్లో వుంచాను.

వెంటనే అందరూ కరతాళ ధ్వనులు చేశారు.

ఇంతలో మిత్రులలో కొందరు ముందుకు వచ్చి "ఏయ్ సుశీల్‌రావు, యీ శుభసందర్భంలో నీ స్నేహితుడు మెజీషియన్ కామేష్ చేత ఒక మాజిక్ చేయించాలి" అని పట్టుబట్టారు.

వెంటనే మిగిలిన వాళ్ళంతా ఏక కంఠంతో "అవును కామేష్...... మాజిక్ చెయ్యాలి" ......... అంటూ ఒకటే అరవడం మొదలెట్టారు.

అట్లా కాసేపు బతిమాలించుకుని, కేక్ చుట్టూ వున్న క్రొవ్వొత్తులలో ఒక వెలుగుతున్న క్రొవ్వొత్తిని తీసుకుని, అందరికి కనిపించేలా పట్టుకుని, పడన్‌గా నోట్లో పెట్టుకుని కర... కర నమిలి మింగేసి, చేతిలో మిగిలిన చిన్న క్రొవ్వొత్తి ముక్కను టేబుల్‌మీద గిరాటేశాను!

అంతే! అంతా నోళ్ళు తెరచుకుని అట్లా చూస్తూ వుండిపోయారు.

వాళు తేరుకునేలోగా, నేను నా ప్రక్కనున్న యిద్దరి తెరచుకున్న నోళ్ళలో చెరొక కేక్ ముక్క దూర్చాను.

ఆ మరుక్షణం భవంతి అంతా చప్పట్లతో మారు మ్రోగిపోయింది.

రహస్యం :— నేను ఫంక్షన్‌కి వచ్చే ముందే చిలకడదుంప (రత్నపురిగడ్డ లేక గెనిసిగడ్డ)ని క్రొవ్వొత్తి ఆకారంలో తయారుచేసి, అంగుళం పొడుగున్న అసలైన క్రొవ్వొత్తిని చిన్న సూదితో జత చేసి తీసుకు వచ్చినట్లుగా అక్కడున్న వాళ్ళెవరికి తెలీదుగా!

— భావరాజు కామేష్.

# వారఫలం

మహేష్

27–1–1978 శుక్రవారం మొదలు
2–2–1978 గురువారం వరకు

**మేషం:**— వృత్తిలో మార్పునావకాశాలు లభిస్తాయి. పోటీవారితో వాద ప్రతివాదాలు తప్పవు. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్త్రీలకు ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి.

**వృషభం:** ఆర్థిక వ్యవహారాల్లో మొగ్గ వాటాలు తగవు స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది ఇతరుల నిమిత్తం మీరు శ్రమ పొందవలసి వస్తుంది. స్త్రీలకు— బంధుమిత్రులను కలుసుకొంటారు. ఆడంబరంకోసం వ్యయం జరుగుతుంది

**మిథునం:**— మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. మీ ఆలోచనలు ఇతరులకు ఫలిస్తాయి. మునుముందు ప్రారంభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం:**— రావలసిన డబ్బు అందుతుంది. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి, సాహసిక వ్యవహారాలు లభిస్తాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. స్త్రీలకు సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**సింహం:**— మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. పోటీవారితో గౌరవం బాగుంటుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయోజనకరమైన పరిచయాలు ఏర్పడతాయి. అధికారులవలన రావలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

**కన్య:**— శ్రమ కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లోనే నష్టం రాగలదు. వారంమధ్యలో ప్రయాణాలు ఫలిస్తాయి. వ్యాపారంలో ఆదాయం

# మీ పాపాయికి బుద్ధి చెప్పినట్లే ఆ జలుబుకూ స్వస్తి చెప్పండి. మందలించండి, ముద్దుచేయండి.




## రబెక్స్

**అంతా మీ ధోరణిగలదే! జలుబుపై ఓ దెబ్బవేసి ముద్దుగా దూరం చేస్తుంది. ఆపైన మీ పాపాయికి ఉపశమనం, హాయి...**

# రబెక్స్

రబెక్స్‌లోని జలుబు నుండి ఉపశమనాన్ని కలిగించె విశ్వాసనీయమైన ఆరు ఔషధాలు (మెంథాల్, కేంఫర్, థైమాల్, టర్పెంటైన్, యూకలిప్టస్ ఆయిల్, నట్‌మెగ్ ఆయిల్), మీరు అతని ముక్కుపై, గొంతుకపై, ఛాతీపై వీపుపై రాయగానే వేడి హాయిని వ్యాపింప చేసి ఉపశమనాన్ని కలిగిస్తాయి. రబెక్స్ త్వరలోనే అతని ముక్కు దిబ్బడను, ఛాతిలో బిగువును పోగొట్టి హాయిగా ఊపిరి పీల్చుకునేందుకు తోడ్పడుతుంది. పైగా, రబెక్స్‌తోనూ మీ పాపాయిలో నవ్వులు కోకొల్లలు...త్వరలోనే.

మంటగానీ, అంటుకు పోవడంగానీ లేకుండా జలుబుల నుండి ఉపశమనాన్ని కలిగించే శక్తివంతమైన మలాము...

గ్లైకోడిన్ వంటి అధునాతనమైన మందులను తయారుచేసే Alembic అలెంబిక్ ఉత్పాదన

everest/665/ACW-ll

పెరుగుతుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణింపజాలదు. స్త్రీలకు ఆరోగ్యం బాగుండదు. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**తుల:—** మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో చికాకులు ఏర్పడతాయి. వృత్తి రీత్యా [illegible]మైన వార్తలను వింటారు. వారం ఆఖరులో ఆర్థిక వ్యవహారాలు తీరిగ్గా సాగుతాయి. స్త్రీలకు కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.



# వారఫలం

**వృశ్చికం:—** ప్రయోజనవంతుల పరిచయాలు ఏర్పడతాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం ఆఖరులో చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. స్త్రీలకు ఆరోగ్యం బాగుంటుంది. అధిక వ్యయం జరుగుతుంది.

**ధనుస్సు:—** అనుకూలమైన వార్తలను వింటారు. రావలసిన డబ్బు అందుతుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. స్త్రీలకు ఆరోగ్యం బాగుంటుంది. అలంకార వస్తువులు కొంటారు.

**మకరం:—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. ఆందోళన కలుగుతుంది. వారం మధ్యలో అనుకూలమైన మార్పులు వస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. స్త్రీలకు కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. పుణ్య కార్యాలు చేస్తారు.

**కుంభం:—** రావలసిన డబ్బు అందుతుంది ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో ప్రయాసకు గురి కాగలరు. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు బాగుంటాయి. స్త్రీలకు ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**మీనం:—** రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మీ ఆలోచనలు ఫలిస్తాయి. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు. ●

## గమనిక

వ్యక్తులపేర మీ రచనలు పంపితే వాటి పరిశీలనలో ఆలస్యం జరిగే ప్రమాదాలెక్కువ కనుక మీ రచనలన్నీ కూడా శీర్షిక పేరు కవరుపైన లేదా కార్డుపైన ఉదహరిస్తూ సంపాదకుడు, ఆంధ్ర పత్రిక వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ — 520 003 అన్న చిరునామాకి పంపండి. —సం.







# ఫాలాక్షుని డైరీ

## ఎలుకల కూర !

థాయ్‌లాండ్‌లో ఎలుకల బాధపడలేక, అక్కడి ఎలుకలను వా ఎట్లుపట్టాలని ఆలోచించిన ఆ ప్రభుత్వం ఎలుకలను అన్నంలోకి కూరగానో, టిఫిను గానో, ఎందుకు వాడరాదు అనే విషయం మీద విజ్ఞాన పరిశోధనలారంభించమన్నదక్కడి విజ్ఞాన వేత్తలను — తేలితే మనకీ మంచిది. 'గుత్తొంకాయ కూరలా పొట్టచీల్చి మసాలా పెట్టి వేయించుకు... తింటారేమో!

## కోటికి లక్ష మంది బిచ్చగాళ్ళు

పవిత్ర భారతదేశంలో యీనాడు 66 లక్షల మంది బిచ్చగాళ్ళున్నారట. వీరిలో ఒక లక్షా పదిహేను వేల ఐదొందలమంది సుమారు పద్నాలుగేళ్ళలోపు వారట. యాభై య్యేళ్ళు పైబడ్డ వారో పన్నెండు లక్షల మందట. కుష్ఠురోగులు లక్షా యాభై వేల మందున్నారట. గుడ్డివారు ఎనిమిది లక్షలు, చెవిటివారు మూడు లక్షలమంది, పిచ్చివారు వో లక్ష మందీ వున్నారట — వుండనియ్యండి. భారతదేశంలో ఎవరి స్వాతంత్ర్యం వారికుంది కదా!

## మారుతీ ఆదాయం !

మారుతీ కంపెనీ యొక్క ఆదాయం 1975 వ సంవత్సరంలో సుమారు కోటి రూపాయలని, ఆదాయ, వ్యయ లెక్కలు చెప్పాయట. ఈ లెక్కలే ఆ కంపెనీ ఆదాయం 1974 వ సంవత్సరంలో కేవలం ఒక్క వెయ్యి రూపాయలే అని తేల్చాయట — అవునేమో!!

## కాపలా వాణ్ని చంపిన దుప్పి

మెట్టూరు ఆనకట్ట క్రిందున్న పూంపాళ్ళ కాపలాదారుడు మాదివ్ఞ ... ఫారెస్టు ఆఫీసుకు సంబంధించి ... సిద్ధి చేస్తుండగా ఆ దుప్పి తన కొమ్ములతో అతన్ని కుమ్మి చంపేసిం దట. అతని భార్యకు ప్రభుత్వం నష్టపరిహారంగా పదివేల రూపాయలు యిచ్చిందట.

## పార్సిల్ లో పసిబిడ్డ

సెంగోట్టయ్ అనేవూరునుంచి శ్రీవెల్లిపుత్తూరు అనే స్టేషనుకు వచ్చిన రైల్వే పార్సిళ్ళలో వో పార్సిలు దింపుతుండగా లోపలేదో కదిలిన శబ్దం అయిందట. ఆ పార్సిలును విడిగా పెట్టి పోలీసుల క్కబురంపారట రైల్వేవారు. వారొచ్చిఆ పార్సిలు తీసుకోవాల్సిన వారెవరూ రానందువల్ల అను మానంతో ఆ పార్సిలు బహు జాగ్రత్తగా విప్పదీస్తే లోపల బట్టలలో కువ్వాయ్ అని ఏడుస్తూ వో అయిదురోజుల పసిగుడ్డు వున్నదట!

## తమ్ముడ్నిబలిగొన్న అక్క ప్రేమాయణం

పూత్తంకరై అనే వూరిలో 16 ఏళ్ళ శివకామి అనే అమ్మాయి అయిన వారందరి కళ్ళుగప్పి 20 ఏళ్ళ గోవిందస్వామి అనే యువకునితో ప్రేమాయణం సాగించుతోందట. ఈ సంగతి ఆమె తమ్ముడు 14 ఏళ్ళ విశ్వనాథనుకు తెలిసి, అక్కను హెచ్చరించి, కట్టుదిట్టం చేశాడట. అతని కళ్ళుగప్పి ఆమె తన ప్రియుణ్ణి కలుసుకుని యీ సంగతి చెప్పేసరికి ఆ ప్రియునికి కోపంవచ్చి ఆమె తమ్ముణ్ణి పీకనులిపి చంపి పారేశాడట.

## తల్లి మూర్ఖత్వం కుమార్తె ఆత్మహత్య

వానుగిరిపేటకు చెందిన 21 ఏళ్ళ పూవాయమ్మ తనతల్లి ఎంచిన సంబంధం ఒప్పుకోక, ఆ పెళ్ళి కొడుకు మూగవాడని, తను కొద్దని పోట్లాడి, యింట్లోంచి పారిపోయి తన అన్నగారి సహాయంతో తాను ప్రేమించిన అతన్ని పెళ్లిచేసుకుని, వో మూడు నెలలు గడిచాక తల్లియింటికి వెళ్ళిందట. తల్లికింకా ... నానామాటలూ అని, నువ్వుఆనాడే ... దాంతో పూవాయమ్మ ... విరిగిపోయి, యీ విషయమంతా వో వుత్తరంలో వ్రాసి, భర్త లేకుండా చూసి ఉరిపోసుకు చనిపోయిందట. తాము కన్నపిల్లల నాశనానికి తల్లి, తండ్రుల మూర్ఖత్వమే చాలా విషయాల్లో కారణంగా కనిపిస్తూంటుంది.

## ప్రవేశం అల్లుళ్ళకే !

పశ్చిమ జర్మనీలో నిరుద్యోగ సమస్య తలమునక లంతయి, యిహ దేశానికి పైదేశం వారెవరూ రారాదు అనటాని రూలు వేసినారట. కానీ, ఆ దేశం అల్లుళ్ళు మాత్రం రావచ్చుని చిన్న సవరణ చేశారట. తత్ఫలితంగా పశ్చిమ జర్మనీలోకి ప్రవే శించి స్థిరపడాలనుకునేవాళ్ళు ఆ దేశపు ఏ అమ్మాయి నైనా, ఎంత డబ్బయినా యిచ్చి పెళ్ళాడడానికి చూస్తున్నారట.

## అద్భుత శక్తులుగల ఏడేళ్ళ బాలిక

జనగామపల్లిలో అరుణభారతి కార్యాలయానికి చెందిన ఆవరణలో వో సమావేశంలో ప్రొద్దు టూరు వొకేషనల్ కాలేజీ లెక్చరరు బండ్ల వెంకట రాఘవయ్య అనే ఆయన ఏడేళ్ళకూతురు ఇందిరా ప్రియదర్శిని బియ్యే తరగతి వారి లెక్కల పుస్తకం లోని లెక్కలు సునాయాసంగాచేసి చూపిందట. లెక్క చెప్తుండగానే ఆమె ఆన్సర్లు చెప్పిందట. సభలోని లెక్కల లెక్చరర్లు ఇచ్చిన లెక్కలు టక్కున చేసి చూపిందట. అంతేగాక ఎంతదూరంలో కూర్చుని వున్నవారయినా వారు రాసిన అంకెలు చెప్పిందట. అంతేగాకుండా సభలోని కొందరి జేబుల్లో వున్న నోట్ల నెంబర్లు కూడా చెప్పిందట. సభికులంతా ఇంద్రజాలం చూస్తున్నట్లు మంత్రముగ్ధులై పోయారట. ఆ ఇందిరా ప్రియదర్శినికి మనోనేత్రం, జ్ఞాననేత్రం వుండివుండాలని సభ అన్నదట.

## దారుణ హత్య

హైదరాబాదులోని పూల్‌బాగ్ శ్మశానంలోని వో బావిలో 40 ఏళ్ళ వ్యక్తి శవం దొరికిందట. శవం వో గోనెలో వుందట. శవంమీద బోలెడు గాయా లున్నాయట. అంతేగాక శవం కుడిచంకలో వున్న వో మూట విప్పిచూస్తే, అందులో వృషణాలు వున్నాయట. ఘాతుకంగా అతని వృషణాలు కోసి అతని చంకలో మూటగట్టి పెట్టారటా వా రెవరో.

# అంతరం

బెహరా
వెంకటసుబ్బారావు



తిరుపతి యాత్ర చేసుకొని తిరిగివస్తూ రాజమండ్రీలో దిగాం. అక్కడ మా శంకరానికి వుద్యోగం శంకరం మా బాబాయి కొడుకు మధ్యాహ్నం భోజనాల యాక కొంత నిద్ర తీసాం, నాలుగ్గంటలకు తెలివి వచ్చింది లేచాను.

"అలా టవున్‌లోకి వెళ్దాం!" అన్నా శంకరంతో.

"రెస్టు తీసుకోరా! రేపు నేనూ ఆఫీసుకు శలవు పెడతా! వూరంతా మా ఒదినగార్కి కూడా చూపిద్దాం!!" అన్నాడు.

నాకు శలవు అయిపోయింది మర్నాడే జాయిన్ అవాలి. ఆ విషయమే చెప్పా. ఒక్కరోజయినా వుండమందుకు శంకరమూ, మా కురదలూ అసంతృప్తిని వ్యక్తం చేసారు. కానీ నే నదేమీ పట్టించుకోలేదు. మర్నాడు తప్పకుండా వెళ్ళాలనిచెప్పా. కాఫీలు అయాయి. 'తోటికోడళ్లిద్దరూ కబుర్లు చెప్పకొంటూ వుండండని' చెప్పి నేనూ శంకరమూ టౌనులోకి బయలుదేరాం. అలా తిరిగి తిరిగి ఒక సినీమాహాలు దగ్గర కొచ్చాం. "ది లాంగెస్టు డే" ఆడుతోంది.

"ఈ పిక్చరు చూసావా?" అడిగాడు శంకరం బొమ్మలు వైపు చూస్తూ.

"లేదన్నా" నేనూ పోస్టర్లను చూస్తూ.

"మరోసారి చూద్దాంలే!" అన్నా మొహమాటంగా.

"నీ మొహం! రేపు వెళ్ళిపోతానంటు న్నావ్! అయినా యిది ఈ రోజుతోనే ఆఖరు!" అన్నాడు.

"అయితే సరే!" అన్నా. మెయిన్ గేటు దాటి లోనికి అడుగుపెడుతూ ... శంకరం గబగబా అడుగులు వేసుకొంటూ బుకింగ్ దగ్గర కెళ్ళాడు జనం ఆట్టే లేరు. శంకరం రెండు ఫస్టుక్లాసు టిక్కెట్లు కొని తెచ్చాడు పిక్చర్ బిగిన్ కావడానికి చాలా టైముంది. బయటనే నిలబడ్డాంవచ్చేపోయేజనాన్నిచూసుకుంటూ.

ఓ రిక్షా సరాసరి లోనికి వచ్చి ఆగింది. అందరూ అటు వైపు చూసారు. మేమూ చూసాం. ఆ హాలుకి యజమానో, మేనేజరో ఎవరో తెలియదుగానీ వో వడి వయస్కుడు ఆదరా బాదరా బుకింగాఫీసులోంచి బయటకు వచ్చి పెద్ద పెద్ద అడుగులు వేసుకొంటూ రిక్షాను సమీపించాడు వినయంగా చేతులు జోడించి.

"దయచేయండి సార్!" ఆహ్వానించాడు.

ఆయన ఠీవిగా ప్రసన్న వదనంతో అడుగు క్రింద పెట్టారు ప్రతి నమస్కారం చేయకుండానే. ఆయన తరువాత ఆమె దిగి హుందాగా నలువైపులా దృష్టి సారించింది. ఆమె సుపరిచితమైన స్త్రీయే! ఎవరు చెప్మా?" అని ఆలోచిస్తూ వుండిపోయా జ్ఞప్తికి వచ్చింది ఆమె విజయ! నిశ్చయంగా విజయే! నన్ను గుర్తించలేదా! లేక నన్ను మర్చిపోయిందా? నన్నుచూసినా ఆమెలో యేవిధమైన మార్పు కన్పించ లేదు. నా అనుమానం నివృత్తి చేసుకొందుకు కొంచెం దగ్గరగా వెళ్లి చూడా లనుకొన్నా. ఆఫీసరు భార్యలా వుంది! దగ్గరగా వెళితే బావుండదని దూరంనుంచే పరీక్షగా చూడ్డం మొదలుపెట్టాను.

ఎడమ చెక్కిలి క్రింద ఆ నగింజంత పుట్టుమచ్చ స్పష్టంగా కన్పించింది. ఆ పుట్టుమచ్చనుచూసి "ఐశ్వర్యవంతురాలవుతుంద"ని అమ్మ అంటూ వుండేది! నాకు బాగా జ్ఞాపకం! ఆమె విజయే! సందేహం లేదు!" నన్ను చూసికూడా ఎందుకు పలకరించలేదు? భర్త దగ్గరవున్నాడు బాగుండదు! కనీసం నవ్వుమొహం అయినా పెట్టొచ్చునే! కళ్లతోనే పలకరించవచ్చునే! నిర్లక్ష్యమా? అతిశయమా? అహంభావమా? ఏమైతే అయిందని నాకు నేనుగా వెళ్ళి పలకరించాలనుకొన్నా!

కానీ వారిని ఆహ్వానించిన ఆ నడివయస్కుడు వారిని స్వయంగా హాల్లోకి తోడ్కొని వెళ్లాడు, రిజర్వుడు క్లాసులో కూర్చోబెట్టి నమస్కరించి శలవు తీసుకొని


TATA'S
501
NEW BLUE DETERGENT BAR
501
కొత్త

అ ం త ర ం

బయటకు వచ్చేశాడు వారిని అనుసరించిన నేను ఆ క్లాసు గేటు దగ్గరే ఆగిపోయా.

'వాళ్లు నీకు తెలుసునేవిట్రా?' అడిగాడు శంకరం నా వెనుకనే వచ్చి. శంకరం నాతో వున్నాడన్న విషయమే మర్చిపోయా.

"ఆఁ" అన్నా ఆలోచిస్తూ.

అతను మాట్లాడలేదు.

"ఏ క్లాసు [illegible]" అడిగా, వాడు ఫస్ట్ క్లాసు మాత్రమే తీ[illegible]ని తెల్సికూడా.

"[illegible] జర్నీవుడు తియ[illegible]టా?" అడిగాడు నా ప్రశ్నలోని ఆంతర్యం అర్థం చేసుకొని. నేను మౌనంగా వుండిపోవడంతో వాడు వెళ్లి టికెట్టు ఎక్స్చేంజి చేసి పట్టుకొచ్చాడు.

"ఆయన వుద్యోగం ఏవిటో తెలుసా?" అడిగా అపూరివాడేకదా తెల్సి వుంటుం దన్న ఆశతో.

'తెలీ'దన్నాడు.

"వాళ్లు నీకూ తెలీ దా?" మరలా శంకరమే అడిగాడు అనుమానంగా.

'ఆమెను తెల్సు! కానీ ఆయన్నుతెలీదు!' అన్నా, హాల్లోకి అడుగుపెడుతూ. టికెట్టు చింపుతూంటే గేట్‌మాన్‌ని అడిగా.

"ఆ లాస్ట్ ఫేన్ క్రింద కూర్చున్న వారెవరయ్యా?" అని.

ఆ ఆఫీసరుగారి డిజిగ్నేషన్ చెప్పాడు. అచేతనుడనైపోయా.

"పదరా! లోపలికి!" తోసాడు శంకరం. తిన్నగాపోయి వారి పై వరుసలో వెనుక సీట్లో కూర్చున్నాం.

నా ఆలోచనలు వేరు.

* * *

పదిహేనేళ్ళ క్రితం విశాఖపట్నంలో మేమూ పురుషోత్తం మాష్టారూ ఒకే యింట్లో అద్దెకుండేవాళ్లం. పురుషోత్తం మాష్టారు మున్సిపల్ హైస్కూల్లో సెకండర్ గ్రేడ్ టీచరు! మా నాన్నగారు డిప్యూటీ తహసీల్దారుగా వుండేవారు.

ఒకే వర్ణం ఒకే శాఖ! ఒకే కుటుంబంగా మసలేవాళ్లం! నేను బియ్యే చదువుతూంటే విజయ ఎస్సెల్సీ చదువుతూండేది. మా అమ్మని విజయావాళ్లమ్మ ఒదినగారూ అని పిలిచేది. విజయ అత్తయ్యగారని పిలిచేది. నేనూ పురుషోత్తం మేష్టార్ని మామయ్యగారూ అని పిలిచేవాణ్ని. మా ఉభయ[illegible] సరిపోయింది. యిద్దరికీ వివాహం చేస్తే బాగుంటుందని విజయ తల్లి జగదాంబ గారూ మా అమ్మా అనుకొనేవారు. జగదాంబగారు ఒకసారి తన అభిప్రాయాన్ని భర్తతో చెప్పారు. అయితే ఆయనకది ఉల్లాసంగా తోచింది.

"ఆయన తాసిల్దారూ, నేను బడి పంతుల్ని! మనమధ్య చాలా అంతరం వుంది! చనువుగా వుంటున్నారని అలాంటి పిచ్చిపిచ్చి ఆలోచనలు పెట్టుకోకు!" అని భార్యను మందలించారు మాష్టారు.

ప్రక్కగదిలోనేవున్న మా అమ్మా నాకూ మాష్టారి మాటలు స్పష్టంగానే విన్పించి ఒకరి మొహాలు ఒకరు చూసుకొన్నాం.

విజయ ఎస్సెల్సీ ఫెయిలయింది. చదువు మాన్పించారు. పెళ్లి సంబంధాలు చూడ్డం ప్రారంభించారు. వారడిగిన కట్నాలు యిచ్చుకోలేని మేష్టారు యే సంబంధాన్ని ఖాయంచేసుకోలేక పోయారు.

"రెండువేలైనా ఈయకపోతే ఎవరు చేసుకొంటారండి!" అంటూ వుండే

జగదాంబగారు.

ఒకనాటి రాత్రి, నాన్నగారితో అంది అమ్మ ధైర్యంచేసి:

"విజయకి పెళ్ళివారొచ్చారు ఈవేళ!" అని

నాన్నగారు పేపరు చదువుకొంటూ. "ఊ!" అన్నారు అనాశక్తిగా.

అమ్మకి చికాకు వేసింది నాన్నగారి ధోరణికి

"కుర్రాడు తాలూకాఫీసులో గుమాస్తాట!" అంది వివరాలు చెప్ప బోతూ.

"అయితే?" అన్నారు చికాగ్గా.

"అవికాదండీ!" అంది నాన్పుతూ

చర్రున పేపర్ను 'పక్కకువిసిరి' ఏవిటన్నట్టు! చూసేరు డిగ్రస్పెస్సుకు అసహనంగా. వెంటనే పేపర్లో తలదూర్చారు

"అవి కాదండీ! మన రవికి చేసుకొంటే బావుంటుందేమో!" అంది మెల్లిగా భయ భయంగా.

నాన్నగారు పేపర్ను టేబిలుమీదికి గిరాటు వేసారు కోపంగా

"అలాంటి వెర్రి వెర్రి ఆలోచనలు పెట్టుకోకు! బడిపంతులుకి మనబ్బాయి అల్లుడవటమా? వాళ్ళంతస్తేవిటి మనం తస్తేవిటి! అయినా యిప్పుడు వాడికి పెళ్ళేవిటి? ఎమ్మె అవాలి ఉద్యోగం రావాలి! అప్పుడు చూద్దాం! అయినా వారితో మనకు వియ్యం సరిపడదు!!"

ఖండితంగా చెప్పారు నాన్నగారు.

అమ్మ మాట్లాడలేక పోయింది. నాకు ఏమనడానికి ధైర్యమే లేకపోయింది. మరో సంవత్సరం గడిచింది. విజయకు సంబంధాలు కుదరలేదు. నేను బియ్యే రెండో సంవత్సరం చదువుతూండగా మా నాన్నగార్కి ప్రమోషన్‌మీద బెజవాడ ట్రాన్సఫర్ అయింది. బెజవాడ వెళ్ళాక మరో సంవత్సరానికి మా నాన్నగారు పోయారు. స్వగ్రామం చేరుకొన్నాం. బియ్యే బియ్యీడీ అయా. హైస్కూల్లో టీచరు వుద్యోగం అయింది. కులమహిత అనురాధతో వివాహం అయింది. పురుషోత్తంగారి కుటుంబ విషయం పూర్తిగా మర్చిపోయాననే చెప్పాలి. పది హేను సంవత్సరాల తర్వాత తిరిగి విజయను చూసా... అయిదు సంవత్సరాలు ఒకే యింట్లో వున్న నేను విజయను పోల్చుకోలేక పోలేదు. ఆమె కూడా పోల్చుకో లేదంటే నేను నమ్మలేను ఆమెను సులువుగా పోల్చుకోవచ్చు! ఆమె ఖచ్చితంగా విజయే! అయితే వెయ్యి రూపాయల కన్న ఎక్కువ కట్నం యివ్వుకోలేని పురుషోత్తం మాష్టారికి ఆఫీసరు అల్లుడుగా ఎలా దొరికాడు?

* * *

ఇంటర్వెల్ యిచ్చారు. లైట్లు వెలిగాయి. చాలా మంది లేచారు తమ తమ అవసరాలు తీర్చుకొందుకు మా క్లాసులో ఎంతోమంది లేరు. ఆ ఆఫీసరూ లేచారు బయటకు వెళ్ళాలని. నాలుగడుగులువేసి వెనక్కితిరిగి

"ఏదైనా డ్రింకు పంపించమంటావా విజ్జీ?" అడిగారు. ఆమె వద్దనీ కావాలనీ సమాధానం చెప్పకపోవడంతో పరధ్యాన్నంగా వుండటం గమనించి దగ్గరగా వెళ్ళి మరలా అడిగారు. అంతలో గేట్‌మాన్ రెండు లిమ్కా బాటిల్స్ తెచ్చి అందించాడు. "మానేజరుగారు పంపారు సార్!" అంటూ. ఆ ఆఫీసరు డ్రింకు త్రాగి బయటకు వెళ్ళారు.

"బయటకు వెళ్ళి కాఫీలు తాగుదాం!" అన్నాడు శంకరం లేచి నిలబడుతూ. శబ్దం చేస్తూ నేనూ లేచి నిలబడ్డా ఆమె వెనక్కు చూస్తుందన్న ఆశతో. ఆమె వెనక్కు తిరగ లేదు. కాఫీ త్రాగుతూ విజయ గురించి వివరించి శంకరాన్కి, సిగరెట్ కాలుస్తూ గేటు దగ్గర నిలబడి ఆమెవైపే చూసా.

లైట్లు ఆరాయ్. స్లైడ్సు మొదలు పెట్టాడు. లోనికిపోయి కూర్చున్నాం.

సినిమా వదిలేక వారి వెనుకనే నడుస్తూ వుంటే శంకరం అన్నాడు నెమ్మదిగా.

"పోయి పలకరించకూడదూ!"

"నన్ను పోల్చుకోలేదురా!" అన్నాగట్టిగా ఆమెకు విన్పించేలా... వాళ్ళను దాటి ఎదురుగా రావాలనే తాపత్ర్యంలో గబగబా అడుగులు వేస్తూంటే నా చెయ్యి పట్టుకొని ఆపాడు శంకరం.

"ఆమెను పలకరిస్తావా?"! అడిగాడు నెమ్మదిగా.

"అవున"న్నట్లు తలూపా.

శంకరం చిన్నగా నవ్వి.

"ఈ వేషంలోనా? మాసిన గెడ్డమూ నలిగిపోయిన బట్టలూ నీవూను! అందుకే నిన్ను పోల్చుకోలేకపోయింది" అన్నాడు మెల్లిగా నన్ను డిస్కరేజ్ చేస్తూ.

రక్కున ఆగిపోయా.

అప్పటికే మానేజరు రిక్షాని రెడీగా వుంచాడు. రిక్షా కదిలిపోయింది.

"రేపుదయం యింటికి వెళ్దాం!" అన్నాడు శంకరం.

"కుదరదురా! రేపు వెళ్ళిపోవాలి! మరోసారి వచ్చినప్పుడు చూద్దాం!" అనేసా.

"ఆమెకూ నీకు మధ్య చాలా అంతరం వుందిరా! ఆమె యెంతో హోదా వలువు బడివున్న ఆఫీసరు భార్య — నీవొక బడి పంతులువి!"

అన్నాడు హేళనగా.

"నిజమే!" అన్నా.



"మన ప్రేమకు చిహ్నంగా ఏమి చెయ్యాలనుకొంటున్నావ్ ! రాధా !!

"మొదటి కాన్పు" అనే నవల వ్రాద్దామనుకొంటున్నా శేఖర్..!!



# అంతరం

మరుసటి నెలలోనే రాజమండ్రి ప్రయాణం తగిలింది. శంకరం కొడుక్కి వుపనయనం చేస్తున్నాడు. అనూరాధకి పురుటి రోజులు కాబట్టి నేనొక్కడినే బయలుదేరా. ఎక్స్‌ప్రెస్ దిగ్గానే అనుకున్నా. ముందు విజయ యింటికివెళ్లి కలియాలని... విజయ యిల్లు కనుక్కోవడం ఏమంత కష్టం అనిపించలేదు. "ఫలానా ఆఫీసరు గారి యిల్లెక్కడ ?" అని ఓ షావుకార్ని అడిగా. అతను వీధి పేరుచెప్పి ఆ యింటిని కూడా వర్ణించాడు. రిక్షాయెక్కి బయలు దేరా.

ఆ యిల్లు పెద్దదే! ముందున్న గేటును తెరిచి లోనికి అడుగుపెట్టా. గేటు చేసిన శబ్దానికి విజయ వీధిలోకి వచ్చింది.

"రా రవీ! చాలాకాలానికి !"

ఆప్యాయంగా ఆహ్వానించింది.

"జ్ఞాపకం వున్నాన్నమాట !" విష్మా రంగా అన్నా.

బదాబుగా చిరునవ్వు నవ్వింది. ఆ నవ్వు పేలవంగా వుంది.

లోనికి తీసుకెళ్లింది.

ఆధునిక ఫర్నిచర్‌తో ఆ యిల్లు అందంగా వుంది. గోడలకి విలువైన చిత్ర పటాలు ! గుమ్మాలకి ఖరీదైన కర్టెన్లు !

"కూర్చో !" అంది.

నేను సోఫాలో కూర్చోగానే తనూ ఎదురుగా మరో సోఫాలో కూర్చొంది.

"ఏవిటిలా వచ్చావ్ ? అత్తయ్యగారూ మావయ్యగారూ బాగున్నారా ?" కుశల ప్రశ్నలేసింది.

"మేము బెజవాడ వెళ్లిన యేడాదికే నాన్నగారు పోయారు ! అమ్మ కులాసాగానే వుంది !" చెప్పా.

'అలాగా పాపం !' అంది ముక్తసరిగా. ఆమెలో నే నిదివరకు చూసిన చలాకీ తనమూ, రీవీ, ఆనందం కన్పించలేదు. ముభావంగా వుంది.

ఎవ్వరూ ఆ యింట్లో కన్పించక పోవడంతో "ఇంట్లో ఎవరూ లేరా ?" అడిగా.

"మావారు హైదరాబాదు వెళ్లారు ! పిల్లలు బజారుకెళ్లారు !" అంది.

"ఏవిటింత డల్‌గా వున్నావ్ ?" అడిగా వుండబట్టక.

"అబ్బే ! ఏమీలేదే !", అంది తొట్రుపాటుగా.

"ఏమో ! ఆ మధ్య సినిమాహాల్లో కన్పించినంత హుషారుగానూ అందంగానూ కన్పించలేదు !" అనేసా.

ఓ నిమిషం నిర్లిప్తంగా వుండిపోయింది.

"అవును ! ఆరోజు థియేటర్‌లో చూసా! యింటికి వస్తావేమోనని ఆ మర్నాడల్లా నిరీక్షించా !" అంది నేలచూపులుచూస్తూ.

"నన్ను మర్చిపోయావేమో ననుకొన్నా ! లేకపోతే పలకరించే వుందువు !" కఠినంగా లన్నా.

ఆమె ఓటాలున తలెత్తి చూసింది.

"నిన్ను మర్చిపోవడమా రవీ!" అనేసి

చిన్నగా దగ్గి మాటలు మార్చి "ఏం చేస్తున్నావ్?" అంది. అంతలో యిద్దరు పిల్లలు వచ్చారు వీధిలోంచి. పదేళ్ళూ, ఆరేళ్ళూ వుంటాయ్.

"అరటి కాయలు అర్ధ రూపాయికీ మూడిస్తానన్నాడు! వంకాయలు బాగులేవు!"

వస్తూనే అన్నాడు పెద్దబ్బాయి కాకీ సంచిని టీపాయ్‌మీద పడేస్తూ.

నే నదేమీ పట్టించుకోనట్టుగా.

"నీ పిల్లలా?" అడిగా.

"అవును! యిద్దరే! నీ కెంతమంది?" తిరిగి ప్రశ్నించింది.

"నాకు ముగ్గురు! రెండు ప్లస్ ఒకటి మైనస్!"

"ఏం చేస్తున్నావ్?" మరలా అడిగింది

"బియ్యేడి టీచర్ని!" అన్నా సిగ్గు పడకుండా

"అదృష్టవంతుడివి!" అంది తృప్తిగా.

"అంటే అయ్యవారి వుద్యోగమూ వొక అదృష్టమేనా?" ఆశ్చర్యపోయా.

మధ్యలో అడిగాడు పెద్దబ్బాయి.

"అరటికాయలు పావలాకొకటి! తెమ్మంటావా?"

"పట్రా బాబూ!" ఆమె సమాధానం చెప్పగానే వీధిలోకి తుర్రుమన్నారు వారిద్దరూ. ఆమె నా మొహంలోకి ఒకసారి చూసి తల దించుకొంది. ఆమెను గమనిస్తూ వుండిపోయా.

ఆమె తలవొంచుకునే అంది.

"ఉపాధ్యాయవృత్తి ఎంతో పవిత్రమైనదీ బాధ్యతతో కూడుకున్నదీనూ! ప్రతి పౌరునీ చక్కగా తీర్చిదిద్దే మొట్టమొదటి అవకాశం వుపాధ్యాయునికే లభిస్తుంది రవీ! ఆవృత్తికి ఎంతో గౌరవం వుంది! సంతృప్తి లభిస్తుందికూడా. ఆఫీసర్లకు హోదావుంటుంది గౌరవం వుంటుంది కానీ అవన్నీ కృత్రిమమైనవి అశాశ్వతమైనవీనూ. ఉపాధ్యాయుడు రిటైర్ అయినా సమాజంలో అతనికి ప్రత్యేక స్థానం ఎప్పుడూ వుంటుంది... సంఘం గౌరవిస్తుందీ, కీర్తిస్తుందీ, శిష్యకోటి అభిమానిస్తుంది ఆదరిస్తుంది. కానీ యితర వుద్యోగాలు అలాంటివికావే! ఎదురుగా గౌరవిస్తారు మన్నిస్తారు, భయభక్తులు ప్రదర్శిస్తారు. అంతా నటన! పరోక్షంగా తిట్టుకొంటారు శపిస్తారు! వ్యూహాలు పన్నుతారు/ [illegible] అల్లుతారు. నీవృత్తికీ మావారి హోదాకి చాలా అంతరం వుంది రవీ!"

ఆమె గొంతు గంభీరమైపోయింది. అసంతృప్తీ ఆవేదనా పెల్లుబికాయ్.

ఆమె మూడ్ బాగులేదని తోచింది. అక్కడ వుండాలనిపించలేదు. లేచి నిలబడ్డా వెళ్ళాలనే వుద్దేశ్యంతో.

ఆమె తలెత్తి చూసింది.

"మరోసారి వస్తా!" అన్నా.

ఆమెకూడా లేచి నిలబడింది.

"కాఫీ తాగి వెళ్దువుగాని!" అంది సభ్యతకోసం.

మరొక్క నిమిషంకూడా వుండబుద్ధి కాలేదు.

"బయట జంక్షన్‌లో మా ఫ్రెండ్స్ వెయిట్ చేస్తున్నారు! మరోసారి వస్తా!" అన్నా అడుగు వేయబోతూ.

ఆమె ప్రక్కకు జరిగింది నాకు దారిస్తూ.

గబగబా బయటకు వచ్చేసా. దారిలో అనుకొన్నా! పురుషోత్తం మాష్టారి సంగతీ, జగదాంబగారి సంగతీ, అడగడమే మర్చిపోయానని.

శంకరంతో చెప్పా. "విజయని కల్సా" అని.

"ఆమె యిప్పుడు నిన్ను తప్పకుండా పోల్చుకొని వుంటుంది! అవునా?" అడిగాడు.

"ఆఁ" అన్నా.

"ఇప్పుడు అందరూ కన్పిస్తారు! కళ్ళు కిందికి దిగాయ్!" అన్నాడు ఏదో చెప్పబోయేవానిలా.

"అంటే?" అడిగా అర్థంగాక.

వివరంగా చెప్పాడు శంకరం.

"వాళ్ళాయన వో షావుకారిదగ్గర వంద రూపాయలు లంచం తీసుకొంటూ దొరికిపోయాడు! సస్పెన్షన్‌లో పెట్టారు!"

"అతను లంచాలు తీసుకొంటాడా?"

నా అమాయకపు ప్రశ్నకి అతను నవ్వుకొన్నాడు.

"తీసుకొంటాడా? అదేం టూ చవ్వు ప్రశ్న? అతని డిజిగ్నేషన్ ఏమిటి? అతనంటే అందరకీ సింహస్వప్నం అనుకో! అంతా వలపన్ని పట్టించేసారు! పీడ వదిలిపోయిందని అందరు హాయిగా వూపిరి తీసుకొన్నారు!"

చెప్పాడు శంకరం.

నాకు నోటమాట రాలేదు.

విజయ మాటలు జ్ఞాపకానికి వచ్చాయ్

"నీ వృత్తికి మావారి హోదాకి చాలా అంతరం వుంది రవీ!" అని.



ఆ మధ్య చిత్తూరులో జరిగిన శ్రీ కలువకొలను సదానంద సన్మానోత్సవంలో ప్రసంగిస్తున్న ప్రముఖ రచయిత శ్రీ కొలకలూరి ఇనాక్. వేదికపై కూర్చున్నవారు శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయం ఆంధ్ర శాఖాధ్యక్షులు ఆచార్య శ్రీ జి. ఎన్. రెడ్డి, శ్రీ సదానంద, చిత్తూరు జిల్లా కలెక్టరు శ్రీ డి. రామకృష్ణయ్య, శ్రీ కె. . భా.

# ఉప్పు కాజాలు

మైదాపిండి 1 కిలో, పాలు పావుశేరు, ఉప్పు తగినంత, నెయ్యి లేక డాల్డా 200, గ్రాములు నూనె 500 గ్రాములు.

తయారుచేయు విధానం : పైన చెప్పిన విధముగా మైదాపిండిని నెయ్యి, పాలతో ఉప్పుతో పూరీలపిండి మాదిరిగా కలుపుకోవాలి. పిండిని చిన్న చిన్న ఉండలుగా చేసి పూరీల మాదిరిగా వత్తి ఆ పూరిని మూడు మడతలుగా వేసి(అంటే దీర్ఘచతురస్రాకారంగా వస్తుంది.) వత్తుకోవాలి. దీనిని ఆట్లకాడతో సన్నగా కోసుకోవాలి. స్టౌ మీద బాణలి పెట్టి నూనె పోసి అది కాగిన తరువాత ఈ ముక్కలను నూనెలో వేయించి తీసుకోవాలి.

అంబడిపూడి కళ్యాణి



# వంటలు



## కొబ్బరి పలావ్

కావలసిన సామానులు :– ఎండు కొబ్బరి చిప్ప 1, బియ్యం పావు కేజి, బంగాళా దుంపలు పావుకేజి, ఉల్లిపాయలు పావుకేజి, బీట్‌రూట్ కేజి, వెల్లుల్లి చిన్నది, జీడి పప్పులు 25 గ్రాములు, బ్రెడ్ 1, దాల్చిన చెక్క, లవంగాలు, మిరియాలు, ఏలకులు కొంచెం, డాల్డా పావుకేజి, పచ్చిమిర్చి 6, ఎండు మిర్చి 2, పలావ్ ఆకు కొంచెం.

ముందుగా బియ్యం (పలావ్ బియ్యం అని బజార్లో అమ్ముతారు. సన్నగా వుంటాయి బియ్యం) శుభ్రం చేసికొని, బాగా కడిగి ఒక బుట్టలోకి వాడేసుకోవాలి. తరువాత మసాలా సామాను దాల్చినచెక్క, లవంగాలు, మిరియాలు వేయించి దంచుకోవాలి. ఏలకులు, పచ్చిమిర్చి, ఎండుమిర్చి ఒక్కొక్కటే వేసి మెత్తగా దంచుకోవాలి ఎండుకొబ్బరి వేరే పొడి చెయ్యాలి మెత్తగా.

ఇక ఒక గిన్నెలో కొద్దిగా డాల్డా వేసి జీడి పప్పులు, బ్రెడ్ ముక్కలు ఎర్రగా దోరగా వేయించాలి. తరువాత మిగిలిన డాల్డా వేసి దంచిన మసాలా, కొబ్బరిపొడి వేసి కమ్మగా వాసన వచ్చేవరకు వేయించి, బంగాళాదుంప ముక్కలు, బీట్‌రూట్ ముక్కలు, ఉల్లిపాయ ముక్కలు వేసి వేయించాలి. వాడేసిన బియ్యం నీళ్ళు కారిపోయి పొడిపొడి అయివుంటాయి. అవికూడా ఈ ముక్కల్లో పోసి బాగా కలియ త్రిప్పి ఐదు నిమిషాలు వుంచినాక సరిపడా నీరు (1½ లీటరు నీరు) ఎసరు పోయాలి. మనం పోసిన నీరు అన్నం వార్చకుండానే పొడిపొడిగా ముట్టుకుంటే విడివిడిలాడుతూ పట్టుకుంటే ముద్దలా అవేలా వుండాలన్న మాట. ఎసరులోనే కొద్దిగా పసుపు, తగినంత ఉప్పు వేయాలి. వుడుకుతుండగా పలావ్ ఆకులు వేసి అడుగంటకుండా కలియ త్రిప్పుతూ వుండాలి. నీరు ఇగిరి సరిగ్గా వుడికినాక గిన్నె క్రిందకు దించి వేయించిన బ్రెడ్ ముక్కలు, జీడిపప్పులు వేసి ఇంకోసారి కలియత్రిప్పాలి.

టమోటో పండు దొరికే కాలంలో టమోటా పండ్లుకూడా వేస్తే ఈ "కోకోనట్ పలావ్" రుచి చాలా బాగుంటుంది.

— శ్రీమతి ముద్దా సరస్వతి



# ఉత్తరాలు

(6వ పేజీ తరువాయి)

## సీరియల్

వారానికావారం సస్పెన్స్: థ్రిల్లింగ్ పి.వి. హిమబిందు చాలా చాలా బాగుంది. హిమబిందు శ్రీపతి, మాధవిల పాత్రల్లోని తీరు తెన్నులు చాలా అద్భుతంగా చిత్రిస్తున్నారు. రచయిత్రి చదివిన కొద్దీ మళ్లీ మళ్లీ చదవాలనిపిస్తోంది చపులారి. స్తోంది.

అందే మాలతి. అందే రమాదేవి [కరీంనగర్]

* * *

30—12—77 వ తేదీ ఆంధ్ర సచిత్రవార పత్రికకు నటి శుభమ ఖచిత్రం శోభాయమయంగా వుంది. రెండు కథలు ఎంతో ఆసక్తికరంగా వున్నవి పి. ఎ. హిమబిందు సీరియల్ చాలా ఇంటరెస్ట్ గా నడుస్తున్నది. ఈ వారం రవీంద్ర, రమణగార్ల కార్టూన్లు ఎంతో నవ్వుపుట్టిస్తున్నాయి.

అల్లుమల్లు రామారావు. కలకత్తా]

* * *

నా అభిమాన నటుడు అక్కినేని ముఖచిత్రంతో వెలువడిన (6.1.1978) పత్రిక చూడ ముచ్చటగా ఉంది. సీరియల్స్ లో పి హిమబిందు వూహించని మలుపు తిరిగింది. తరువాత ఏం జరుగుతుందో అని ఎదురు చూసేటట్లు చేసింది ఈ వారం ప్రచురించింది ఒక్క కథయే అయినా ఆమె నిర్ణయం చాల బాగుంది. రచయిత్రి డా చంద్రికకు నా అభినందనలు. ఫాలాక్షునిడైరీ మరీ చిక్కి పోయింది.

ఎం. రిజ్వాన్ అలీబేగ్, [తిరుపతి]

* * *

రాగమాలిక సీరియల్ అత్యంత ఉత్కంఠతో నడుస్తూంది. రచయిత్రిగార్కి నా ధన్యవాదాలు. పి. వి హిమబిందు, రాగమాలిక సీరియల్స్ ఒకదాని కొంటె పోటీ పడుతున్నాయి. చక్కని సీరియల్స్ ప్రచురిస్తున్న మీకు అభినందనలు. ఆమె నిర్ణయం చాలా చక్కగా ఉంది రచయిత్రిగారు బూజుపట్టిన మగవారి భావాలకు ఒక దులుపు దులిపారు. బైస్కోపు ఖాతాఖానీ, బులుసు వేంకట రమణయ్యగారి ధర్మపథం పత్రికకే హైలైట్. దేవరకొండ శివాజి ... [...శ్వరం]

# అవీ......ఇవీ......అన్నీ

### ఆంధ్రలో అగ్నిరుఫాన్

రచన : శ్రీ భీసెట్టి లక్ష్మణరావ్, పేజీలు : 40, వెల : ఒకరూపాయి ప్రతులకు : సాధన పబ్లికేషన్స్, మల్లికార్జునపేట, విజయవాడ—520 001.

### అహం బ్రహ్మ

నాటిక రచన : శ్రీ ఎస్. మునిసుందరం, 40 పేజీలు, వెల : 2 రూపాయలు. ప్రతులకు : విశ్వప్రభ పబ్లిషింగ్ హవుస్, వేంద్రగుంట, చిత్తూరు జిల్లా.

### వాల్మీకి

పద్యకావ్యము. రచన : శ్రీ శనగన నరసింహస్వామి 62 పేజీలు, వెల : 3 రూపాయలు. ప్రతులకు : న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్, ఏలూరురోడ్డు, విజయవాడ—2.

### చతుర్ముఖ రామాయణము

చతుర్విధ కందపద్యకావ్యము. రచన : కీ. శే. గాదె పాపరాజకవి. 264 పేజీలు, వెల: 8 రూపాయలు ప్రతులకు : (1) శ్రీ గాదె ధర్మేశ్వరరావు, లెక్చరర్, అమరావతి, గుంటూరుజిల్లా, (2) నవోదయ పబ్లికేషన్స్, ఏలూరురోడ్డు, విజయవాడ—2.

## శ్రీ ఐ. జె. నాయుడు :

రాష్ట్ర ప్రభుత్వం ప్రధాన కార్యదర్శిగా శ్రీ ఐ. జె. నాయుడు పదవీ విరమణ చేసిన శ్రీ ఎ. కృష్ణస్వామి స్థానే జనవరి 1 వ తేదీన పదవీస్వీకారం చేశారు. ఈయన మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాల నుంచి భౌతిక శాస్త్రంలో ఎం. ఎ. ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. తెలుగు, కన్నడ, హిందీ, తమిళ భాషలలో మంచి పరిచయం ఉంది. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలలో ఐ. ఏ. ఎస్.గా వివిధ పదవులు నిర్వహించారు. కేంద్రం వ్యవసాయ నీటిపారుదల మంత్రిత్వ శాఖ సంయుక్త కార్యదర్శిగా అదనపు కార్యదర్శిగాను కేంద్ర వ్యవసాయ శాఖ కమిషనరుగాను పని చేశారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత ప్రధాన వ్యవసాయ శాఖ డైరెక్టరుగా మంకొన్ని శాఖల కమిషనరుగావున్నారు.

# హైదరాబాద్ నోట్ బుక్

(13వ పేజీ తరువాయి)

భారతీయ ప్రతినిధివర్గ నాయకుడుగా వివిధ దేశాలలో పర్యటించి విశేషానుభవం గడించారు. 1974–75 లో వివిధ ప్రాచ్య పాశ్చాత్య దేశాలకు భారత ప్రతినిధి వర్గ నాయకులుగా వెళ్లారు. శ్రీ నాయుడు రచయిత. ఫార్మర్స్ ఆఫ్ ఇండియా అనే గ్రంథం రచించారు. గ్రామాభివృద్ధిని గురించి వ్యవసాయ గణాంకం గురించి, విత్తనాల రక్షణను గురించి వివిధ నివేదికలు పరిశోధన పత్రాలు వ్యాసాలు వ్రాశారు వీరు పదవిని రాష్ట్రంలో క్లిష్ట సమయంలో స్వీకరిస్తున్నారు.

ఉపశ్రుతి :

ఆఖరుకు ఇలా అయిందేమిటండి? అన్నారు ఒకాయన కాంగ్రెస్ చీలికలను గురించి ఏమైంది. వేరే పార్టీ ఏర్పడింది దేశంలోని కమ్యూనిస్టులు లగాయతు అన్ని పార్టీలకు కాంగ్రెస్సే పుట్టినిల్లు గదా! ఇప్పుడు మాత్రం ఏమయింది. మరొక పార్టీ పుట్టింది. అంతే కదా? అన్నారు అడికాదండి ఇంత హడావుడి చేసి ఈ మొఘానికి అర్థ పేరు పసుపు– అన్న సామెతగా జరిగిందే అని నా దుఃఖం! అన్నాడు. ఆ పెద్దమనిషి కొందరిని గొప్పగా అనుకొని అతిగా గ్రహించుకొని, ఏవో ఆశలు పెట్టుకుంటారు. దానికి భంగం కలిగితే బాధపడుతారు.

— తిరుమల రామచంద్ర.

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## 1978 ఫిలిం బ్యాలట్ పత్రం

1 ఉత్తమ చిత్రం

.............................................

2 ఉత్తమ నటుడు

.............................................

3 ఉత్తమ నటి

.............................................

4 ఉత్తమ దర్శకుడు

.............................................

5 ఉత్తమ సంగీత దర్శకుడు

.............................................

6 ఉత్తమ సహాయ నటుడు

.............................................

7. ఉత్తమ సహాయ నటి

.............................................

8 ఉత్తమ హాస్యనటుడు

.............................................

9 ఉత్తమ హాస్యనటి

.............................................

**ముగింపు తేదీ**
**31-1-'78**




# తాజా కాలమ్

(7 వ పేజీ తరువాయి)

''పిచ్'' మీద చిత్తు చేశారన్న బ్రహ్మాండమైన వార్త ఒక్కటే ఈ ఏడాది తొలివారంలో వెలువడ్డ శుభవార్త! చంద్రశేఖర్, బేడీ, ప్రసన్న కూడా బంతుల్ని వేస్తూంటే ''సింప్సన్ బృందం'' మంత్రించి వేసిన నాగాస్త్రాల కాళ చుట్టూ మెలికలు తిరుగుతూంటే గాభరాపడ్డాయి –బేజారైపోయి వికెట్‌లు పడేసుకున్నారు. చంద్రశేఖర్ మొత్తం 12 వికెట్‌లు తీసుకున్నాడు బేడీని చూసే హడలెత్తిపోయారు 'ప్రసన్నా'ని చేతులు సాచి కొట్టాలంటే ధైర్యం లేక 'జిడ్డు' పట్టాలని ప్రయత్నం చేశారు- మొత్తం మీద 'కొత్త నేతృత్వాన్న' ఆస్ట్రేలియా మీద– బేడీ జట్టు ఆడుతున్న క్రికెట్ యుద్ధరంగంలో మూడో టెస్టులో కూడా తన ఆధిక్యతని నిలుపుకున్నది- చంద్రా' తను వరసగా ఆడిన మూడు యినింగ్సులోనూ కలిపి 149 పరుగులకి 16 వికెట్లు తీసుకున్నాడు గవాస్కర్, విశ్వనాథ్ లే కాదు ''ఘ్రావ్రి' కూడా మూడో టెస్టులో తెగ బాదేశాడు! (64)

క్రికెట్ ప్రియులలో ఒక మంచి లక్షణం వుంది! ఆడుతున్నది మనవాడా? పరాయివాడా? అని చూడకుండా బాగా ఆడుతూంటే హుషారిచ్చి ''ఎంజాయ్ చేస్తారు ఆస్ట్రేలియాలో క్రికెట్ టిక్కెట్ కొనుక్కున్న వాడి పైకంలో ప్రతీ పైసాకి విలువనిచ్చి మంచి ఉత్సాహంగా సాగుతున్నది సింప్సన్ బేడీలను యిందుకు అభినందించాలి !

★★★

**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**

బ్రూక్ బాండ్

# గ్రీన్ లేబిల్

కాఫీ చికరి మిక్చర్

## మీ నాణ్యతకు గ్యారంటీ




OBM-5210A/1/TEL






VIMAL
®
A RELIANCE PRODUCT